## మా ఇతర ప్రచురణలు

1. సత్యాన్వేషణ – సత్య దర్శనం
2. నిజ విచారణ
3. అహంభావము – సంస్కారములు
4. The Art of Self-enquiry
5. దివ్యపురుషుడు భగవాన్ శ్రీ రమణ మహర్షి

ఈ గ్రంథ ప్రచురణకు సహకరించిన శ్రీ S.V.A.R. శాస్త్రిగారికి ప్రత్యేక కృతజ్ఞతలు









ఓం నమో భగవతే శ్రీ రమణాయ

# నేనెవడను?

మూలం :

భగవాన్ శ్రీ రమణ మహర్షి

వ్యాఖ్య :

డా॥ పి.వి.యస్. సూర్యనారాయణరాజు

# నేనెవడను?

Second Edition : 1000 Copies
శ్రీ రమణ జయంతి, జనవరి 4 గురువారం, వ్యయ నామ సంవత్సరం 2007



Rs. 30/-

Published by :
Dr. *P.V.S. Suryanarayana Raju*
Syamala Children Hospital
# 5-8-16, Park Street
NARSAPUR - 534 275, W.G.Dt., A.P., India
✆ 08814 - 273430
e-mail : drrajunsp@yahoo.co.in

Designed at :
**Ananya Graphics**
PALAKOL - 534 260, W.G.Dt., A.P., India
9397151342

Printed at :
**Sri Bhavani Offset Printers**
PALAKOL - 534 260, W.G.Dt., A.P., India
✆ 08814 - 228858







సంబంధించినది. అహంస్ఫురణలో క్రియాశాఖయైన ప్రాణము ఆత్మశక్తికి సంబంధించినది. ఈ చైతన్యము, శక్తి; అగ్నికి వెలుతురు, ఉష్ణము కలిసి ఉన్నట్లు అహం స్ఫురణలో చైతన్యము శక్తి ఎప్పడూ కలిసే ఉంటాయి. ఒక దానిని విడిచి మరొకటి ఉండదు. పరిశీలించకుండా ఉన్నంతవరకే మనస్సు ఉన్నట్లుగా తోస్తుంది. పరిశీలించినప్పడు తలంపులన్నీ నిశ్చలమై మనస్సు లేదని తెలుస్తుంది. మనోమూలమును హృదయపూర్వకంగా తెలుసుకొనే జిజ్ఞాస విచారణ. ఈ ప్రక్రియలో "మిధ్యానేను" ప్రమేయము ఉండదు. తనలో తాను ఉండుట విచారము. "మిధ్యా నేను" తనను బ్రహ్మముగా తలంచుట ధ్యానము. అందువలన ధ్యానములో ధ్యానము చేసేవాడు, ధ్యానము చేయబడేది, ధ్యానము చేయుట అనే త్రిపుటి ఉండును.

## 28వ ప్రశ్న. ముక్తి అనగానేమి?

**భగవాన్ :** బంధమున ఉన్న 'తాను' ఎవడని విచారించి తన యదార్థ స్వరూపమును తెలిసికొనుటే ముక్తి.

**వివరణ :** బంధితునికే ముక్తి ఉంటుంది. శుద్ధ చైతన్యానికి బంధము లేదు. తాను శుద్ధ చైతన్యమని తెలిసికొనుటయే ముక్తి. నిజ విచారణ వలన తన స్వరూపమును ఎఱింగిన మానవుడు ముక్తిని సాధించినవాడు.

జనన మరణ చక్రములో చిక్కుకొని పోయిన జీవుడు తానెవరు? అను జ్ఞాన విచారణ చేసినపుడు మనస్సునకు ఆత్మ జ్ఞానము కలిగి, భేద బుద్ధి నశించి, ఇంతకాలము వ్యష్టిగా తలచిన తనను తాను బ్రహ్మముతో ఏకముగా ఉన్నాను అనే విశిష్ట జ్ఞానమును పొందుతాడు. అదియే ముక్తి.

బంధము, ముక్తి అనేవి అజ్ఞాన జనితమైన మనస్సుకు సంబంధించినవి. బ్రహ్మమునకు ఈ రెండింటితోనూ సంబంధము లేదు. నేను ధ్యానిస్తున్నాను అనే భావము లేకుండా ఉంటే సహజస్థితి అబ్బుతుంది. ధ్యానము చేయగా చేయగా చిత్త వృత్తులన్నీ లోపించి "నేను" అనే ఒకే ఒక చిత్త వృత్తి మిగిలి తుదకు అది కూడా ఆత్మయందు లీనమవుతుంది. తక్కిన విషయాలు వదలి ఒక్క విషయము మీద మనస్సు లగ్నము చేయుట ధ్యానము. చిత్తవృత్తులు పూర్తిగా త్యజించుట వైరాగ్యము. ఇట్టి వృత్తి జ్ఞాన రహిత స్థితి మోక్షము. అట్టి ధ్యాన నిష్ఠ మౌనము, యోగము, పరాభక్తి.

**శ్రీ రమణార్పణమస్తు**

స్వరూప జ్ఞానము లేని మనస్సు ఆత్మానాత్మ విచారము చేయలేదు. అందుచేత మనస్సుకు ఒక్కసారైనా ఆత్మజ్ఞానం కల్గినప్పడు, ఆ మనస్సుకు విచారణ చేసే సామర్థ్యము ఏర్పడి, తన మూలము కొరకు అంతరంగములో అన్వేషించి, ఆ మూలము గోచరించినపుడు దానిలో స్థిరపడి అవధులు లేని ఆనందములో ఓలలాడుతుంది. నిజ విచారణ కొనసాగినపుడు మనస్సు ఎల్లప్పడు అంతర్ముఖముగా ఉండుట వలన కర్మ చేస్తున్నప్పటికీ క్రొత్త వాసనలు ఏర్పడవు. పాత వాసనలు నిర్మూలింపబడతాయి. ఈ వాసనా క్షయము వలన జీవుడు వాసనల ప్రభావము నుండి విడుదల పొందుతాడు.

ఆత్మజ్ఞానము ఒక్కసారైనా కలుగని మనస్సు విచారణ చేయడం మొదలు పెడితే అది రెండుగా విభజింపబడుతుంది. స్వరూప జ్ఞానము లేని అజ్ఞానావృత మైన మనస్సు ఒకటి పరిశీలించేదిగను, రెండవది పరిశీలింపబడేదిగను ఊహించుకొంటాము. ఈ రెండునూ అజ్ఞానానికే సంబంధించినవి కనుక సాధన చేయునప్పడు మనస్సు సంస్కరింపబడకపోగా, మానసిక సంఘర్షణ ఎక్కువవుతుంది. ఇటువంటి వారు సద్గురు సన్నిధిలో మాత్రమే విచారణ చేయాలి. లేకపోతే విచారణలో ప్రగతి (progress) ఉండదు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉంటుంది.

విచారణలో "తెలిసికోవడం" (preception) ఉంటుంది గాని "భావించడం" (thinking) ఉండదు. విచారణ వలన మనము నామ రూప రహితులమని తెలుస్తుంది. తాను చేతనుడని తెలిసిన తరువాత జడము చేతనము కంటె వేరుకాదని తెలియబడుతుంది.

ఆలోచనల సమూహమే మనస్సు. "నేను దేహమును" అనే తలంపు దానికి మూలము. ఆ తలంపు యొక్క మూలానికి వెళితే "నిజమైన నేను" (real 'I') ఎఱుక పడుతుంది. మనస్సు దానిలో స్థిరపడడమే విచారణ. అహంవృత్తి ద్వారా మనస్సు ఆత్మలో మునగాలి. అప్పడు మనస్సు, హృదయము ఏకమై పరిపూర్ణ జ్ఞానము అవిచ్ఛిన్నముగా ప్రకాశిస్తుంది.

"ఉన్నాను" అనే అనుభవమే విచారణకు తుది మెట్టు. దీనిని ఇంద్రియాలతో చూడగలమా?

అహంస్ఫురణలో చైతన్య శాఖయైన మనస్సు ఆత్మచైతన్యానికి



- 2 -



**నర్తన గణపతి**

## గణపతి పూజ

అగణిత ఫణిఫణ మణిగణ కిరణై
రరుణిత నిజతను రవితట వదన
తటతట లుట దళికుల వినదా
గణపతి రభిమత మిహదిష తనుః

లంబోదర వర కుంజా వస్థిత కుంకుమ వర్ణధరం
శ్వేత శృంగం పీనసుహస్తం ప్రీతిత సఫల ఫలం
నాగత్రయయుత నాగవిభూషణ నానాగణపతితం
తత్తన్ నానాగణపతితం

# అంకితము

కం॥ నేనెవరను పొత్తంబును
ధీనుతుడే రమణయోగి దేశికమతికిన్
జ్ఞానికి నంకిత మొసగియు
ధ్యానించెదమానసమున తద్దయు నెపుడున్

ఉ॥ నే నను భావనన్ పెరుగనీయక చిత్తము నుండి గెంటి వి
జ్ఞాన మెరుంగు సాధుగుణశాలుర శీలమెరుంగ కోరుచున్
ధ్యానమె మోక్షహేతువని తద్దయు నమ్ముచు సత్యవర్తివై
పూని చరించు మోయి విరబూచిన మల్లెల మొల్లలట్లుగన్

కం॥ తెలిసియు తెలియని పలుకులు
వెలయించితి పొత్తమందు పెద్దలు మీరల్
చులకన చేయక చదువుము
ఫలితంబును పొందు మోయి భావిని మీరల్

డా॥ **పి.వి.యస్. సూర్యనారాయణరాజు**







నిరాసక్తంగా నిరాశతో ఉంటుంది. ఇది ఆత్మజ్ఞానం కలిగిన మనస్సుకే సిద్ధిస్తుంది. జీవితంలో మనం అనుకున్నది సాధించలేకపోయినప్పుడు కలిగే నిస్పృహ నిరాశ కాదు. ఆశకు అవకాశమిచ్చినప్పుడు ఎంతటి ధీరుడనైనను స్వరూపజ్ఞానము మరపించి విచారణ చేయక విషయలోలుడై వనితాది విషయములను తలంచును. ఆశ కలవాడు దుఃఖియగును, లేనివాడు సుఖియగును.

## 27వ ప్రశ్న. విచారణకు, ధ్యానమునకు గల భేదమేమి?

**భగవాన్ :** మనస్సును తనయందే ఉంచుకొనుట విచారమగును. తన్ను బ్రహ్మముగా సచ్చిదానందముగా భావించుట ధ్యానమగును.

**వివరణ :** ధ్యానమనగా అహం బ్రహ్మాస్మి అనే అనుభవమునకు చేసే ప్రయత్నము. దాని ఉద్దేశ్యమేమంటే బ్రహ్మము మనలో నిజమైన నేనుగా స్వయంజ్యోతితో వెలుగొందుచున్నది. దానిని పొందే ప్రయత్నమే అహం బ్రహ్మాస్మి అనే ధ్యానము యొక్క ఉద్దేశ్యము. అంతఃకరణము నందు శుద్ధ చైతన్యము యొక్క జ్ఞానము నిరంతరము కల్గి యుండుట గొప్ప ధ్యానము. అంతేకాని అహం బ్రహ్మాస్మి అంటూ పలుమార్లు యాంత్రికముగా మనస్సుతో అనుకోవడము కాదు. అట్లు "అనుకొను ధ్యానము" మానసికము. సంకల్పము వలన, కోరికల వలన మనము బ్రహ్మము కాలేము. మానసిక ధ్యానము వలన అహంభావము ఇంకా బలపడుతుంది. అది అలా కొనసాగుతూనే ఉంటుంది.

నేను అది కాదు, నేను ఇది కాదు అనుకోవడానికి ఒక "నేను" ఉండాలి కదా! ఆ నేను చైతన్యాన్ని దేహంతో ముడివేస్తోంది. మనస్సు ద్వారా "నేతి నేతి" అని ధ్యానం చేసినప్పుడు ఈ మిథ్యా నేను కొనసాగుతూనే ఉంటుంది. విచారణ ద్వారా "అసలు నేను"ను గోచరింప చేసుకొన్నప్పుడు మనమే బ్రహ్మమని అనుభవ పూర్వకముగా తెలుస్తుంది. అప్పుడు అహం బ్రహ్మాస్మి అనే ధ్యానం కాని, నేతి నేతి అనే మానసిక సాధన గాని అవసరముండవు.

దేహము, మనస్సు అన్యములు కనుకనే సుషుప్తిలో వాటి నుండి మనము విడివడుతున్నాము. మనస్సును ఆత్మలోనే నిలిపివేస్తే విషయి విషయములు ఉండవు. కర్తలేని కర్మ ప్రవాహము జరుగుతుంది. బంధమనేది బాహ్యముగా లేదు. అది మనస్సులోనే ఉంది.

## 26వ ప్రశ్న. నిరాశకు, జ్ఞానమునకు గల సంబంధమేమి?

**భగవాన్ :** నిరాశయే జ్ఞానము. నిరాశ వేరు, జ్ఞానము వేరు గాదు. నిజమున రెండు ఒక్కటే. నిరాశయనగా ఒక విషయము వైపునకును మనస్సు పోకుండుట. జ్ఞానమనగా ఒక్క విషయమును తోచకుండుట - ఇట్లు చెప్పిన, అన్యము అపేక్షింపకుండుట వైరాగ్యము లేక నిరాశ; తన్ను వదలకుండుట జ్ఞానము.

**వివరణ :** ఏ విషయముపైనను ఆకర్షణ లేకుండుట నిరాశ. అనగా దేనిని గురించి ఆశ పడని మనస్సు నిరాశతో కూడిన మనస్సు. అసలు విషయ స్పృహ ఏమియు లేకుండుట జ్ఞానము. ఒక రకముగా చూస్తే రెండునూ ఒకటే.

మనస్సును ప్రకాశింపచేయునది బ్రహ్మము కన్న వేరుగా లేదని తెలిసి సుఖము బ్రహ్మములోనే ఉన్నందున దానిని వదలకుండుట జ్ఞానము. మనస్సు ఏ విషయము వైపునకును మరలకుండినంత మాత్రమున చాలదు. విషయముల వైపు మనస్సు మరలకుండుట వైరాగ్యము కావచ్చును. కాని అహంకారము తొలగని వైరాగ్యము నిష్ప్రయోజనము. అహంకారము అంతరించినపుడు ఎన్ని సంపదలున్నా బంధ హేతువులు కావు. వైరాగ్యం అశాశ్వత వస్తువుల నుండి శాశ్వత వస్తువు మీదకు దృష్టి మళ్లించుటకు ఉపయోగపడుతుంది. భావ విక్షేపాలను తొలగించుటకు తోడ్పడుతుంది. విషయాలయందు ఇచ్ఛ లేకుండుట వైరాగ్యము. వైరాగ్యము మనస్సును అజమాయిషి చేస్తూ బయట నుండి వచ్చే వ్యామోహాలనుండి రక్షణగా నిలుస్తుంది. వైరాగ్యము యొక్క లక్షణము నిరాశ. వైరాగ్యము, ఆత్మ జ్ఞానము కూడా గురువు అనుగ్రహ ప్రేరణ వలననే సిద్ధిస్తాయి.

జీవునికి అజ్ఞానావృతం వల్ల ఆత్మజ్ఞానం లేనప్పడు ఏదో పోగొట్టుకున్నట్లు ఒక వెలితి లేక అసంతృప్తి ఉంటుంది. ఆ అసంతృప్తి నుండి కోరిక, ఆశ మొదలయి అనేక కర్మలు ఫలాపేక్షతో చేస్తాడు. కోరిక వల్ల చేసిన కర్మఫలం అశాశ్వతం. అందుచేత జీవుడు అజ్ఞానంలో ఉన్నంతవరకు వెలితి, అసంతృప్తి, కోరిక, ఆశ తప్పక ఉంటాయి. ఆత్మజ్ఞానము రుచి చూసిన తరువాత జీవుని అంతఃకరణము పూర్ణానందం పొంది, అంతకంటే పొందేది ఏమీలేదని గ్రహించినప్పడు మాత్రమే నిరాశ సిద్ధిస్తుంది. ఆత్మజ్ఞానం మనస్సుకు కలిగి తరువాత తాను వెదికే సుఖము ఊహించనంత ఎక్కువగా తన మూలములోనే లభించినందున, మనస్సు బాహ్యంలో సుఖం కోసం వెదకటం మాని విషయాకర్షణ లేక, కోరిక, ఆశ నశించి,







## ముందుమాట

ఏ జీవికైనను తనంటే తనకు పరమప్రీతి. ఏ జీవియైనను దుఃఖస్పర్శలేని అవిరళ సుఖము కోరుకొనును. ఏది దేనికి స్వభావ సిద్ధమైయుండునో అది దానికి స్వరూపమై ఎడతెగని సంబంధము కల ధర్మమై యుండవలెను. మనం తెంపులేని సుఖం కోరుకున్నప్పటికి ప్రతివారి జీవితం సుఖదుఃఖముల మిళితమై ఉంటోంది. గాఢనిద్రలో మనస్సడగినప్పుడు దేహతాదాత్మ్యముకాని, భార్యాబిడ్డలు కాని, జగత్తుకాని, విషయాకర్షణకాని లేనప్పుడు మనం సుఖముగా ఉన్నాము అనేది అందరి అనుభవం. గాఢనిద్రలో సర్వాభావమును చూచు "చేతనమే" మిగతా అవస్థలలో సర్వము నెఱుంగుచున్నది. గాఢనిద్రలో కలిగిన సుఖము దేనితో తాదాత్మ్యము లేని స్థితిలో కలిగింది. కనుక సుఖమునకు కారణమంటూ లేదు. అందుచేత సిద్ధాంతపరంగానైనా మన స్వరూపము సుఖమని అంగీకరించ వలసి ఉంటుంది. గాఢనిద్రలో మనం సుఖముగా ఉన్నప్పుడు మనం ఎఱుకలో లేము. జాగ్రదవస్థలో కలిగే ఎఱుకలో సుషుప్తి సుఖము మన స్పృహకు రావడం లేదు. ఎందువల్ల జాగ్రదవస్థలో స్వరూప సుఖమును అనుభవించలేకపోతున్నాము అనేది విచారించాలి. మన స్వరూప మేమిటో తెలుసుకొనుటకు "నేనెవడను?" అను జ్ఞానవిచారమే ముఖ్య సాధనము. మనుష్యత్వం, ముముక్షత్వం, మహాపురుషుల సాంగత్యము అతి దుర్లభమైనవి. ఎవరికి ఈ జన్మమందు ఈ మూడు లభించునో వానిపై భగవంతుని అనుగ్రహం సంపూర్ణముగా కలదనియు, గత జన్మలందు అతని సాధనకు మెచ్చి భగవంతుడు ఈ జన్మలో పై మూడింటిని ప్రసాదించెననియు గ్రహించి వాటిని సద్వినియోగ పరచుకొని మోక్షసాధన చేయవలెను. క్షణకాలమైన వృధా పోనీయక జన్మను సద్వినియోగపఱచు కొనవలెను.

# ఉపోద్ఘాతము

మనం విచక్షణ గల జీవులం. జన్మతః సంక్రమించిన బుద్ధివల్ల మనకు విచక్షణ చేసే సామర్థ్యం, ఆలోచనను సరైన మార్గంలో పెట్టి క్రియ సలపడానికి వెసులుబాటు ఉన్నది. మనకున్న విచక్షణా సామర్థ్యమే లోకంలో ఉన్న మిగతా జీవుల మీద మనల్ని ఉన్నతస్థాయిలో ఉంచుతుంది. మనిషికి ఆలోచించే సామర్థ్యం ఎక్కువ. దైనందిన జీవితంలో సామాన్యంగా మనిషి మనస్సు అశాంతిగా ఉంటోంది. ప్రస్తుతం మన మనస్సు ఏకముగా లేదు (Unitary mind). కులాలవారీగా, దేశంవారీగా, మతంవారీగా, జాతివారీగా, భాషవారీగా, ప్రాంతాలవారీగా, స్త్రీ పురుష భేదం వారీగా విభజింపబడి యున్నది. మనం చేసే ఉద్యోగం, సంఘంలో హోదా, కీర్తి, ప్రతిష్ఠల వల్ల, మనకుండే సంపదలవల్ల మానసిక అశాంతి పరిష్కరింపబడుటలేదు. సరైన ఆహారం, ఇల్లు, ఉద్యోగం లేనివారికి మానసిక అశాంతి ఉండటం సహజం. ఇవన్నీ కలవారు కూడా తీవ్రమనోవేదనతో ఉన్నారు. మనస్సు ఆరోగ్యంగా లేకపోతే దాని ప్రభావం మనస్సు మీద, భౌతిక ఆరోగ్యం మీద, సంఘం మీద ఉంటుంది. వ్యక్తుల సమూహమే సంఘం కనుక వ్యక్తులు అశాంతిగా ఉంటే సంఘం కూడా అశాంతి గానే ఉంటుంది. అందుకే సంఘంలో యుద్ధాలు, ఒకరినొకరు దోచుకోవటం, హింస, మానభంగాలు, లంచగొండితనం, వ్యభిచారం, తోటి మనిషి కష్టాలలో ఉంటే ఏమాత్రం పట్టించుకోకపోవటం, సంపద ఉన్న వాళ్ళు ఇంకా ఎక్కువ సంపద కోసం ప్రయత్నించటం, రాజకీయాధికారం కోసం తోటి మనిషిని తుదముట్టించడానికైనా వెనుకడీయని మనస్తత్వం, మనస్సులో కుళ్ళిపోయి దానిని మరుగుపరచడానికి దానం చేయటం, దాని ద్వారా కీర్తి పొందాలని ఆకాంక్షించటం ఇవన్నీ దైనందినజీవితంలో సర్వసామాన్యం. చాలా మందికి మానసిక క్రమశిక్షణ లేదు. వారి మనస్సు అస్తవ్యస్తంగా ఉంది. పూర్తిగా పిచ్చి వాళ్ళు చాలామంది ఉన్నారు. అది కాకుండా నూటికి ముప్పైమందికి సమాజంతో సర్దుబాటు చేసుకునే మానసిక రుగ్మతలతో బాధపడుతున్నారు. (Socially adjustable mental illness) మనం విచక్షణ గల వ్యక్తులం గనుక మనస్సు ఎందుకిలా ఉన్నది అని విచారణ చేసుకోవాలి. మానసిక రుగ్మతలున్న వారి



- 3A -



ఆశ లేకుండుట, నిర్భయత్వము, నిత్యత్వము, సమత్వము, జ్ఞానము, మనస్చపలత్వ రాహిత్యము, నిష్క్రియత్వము, సదా ప్రసన్నత్వము, వికల్ప రాహిత్యము, సర్వ భూత దయ, ప్రజ్ఞ, సంతుష్టి, మృదుభాషణము మొదలగునవి ఊరక ఉన్నప్పుడు మనతోనుండును.

ఊరక ఉండుటయే సాక్షితత్త్వ లక్షణము. మార్గమున పోయే బాటసారులు రాగద్వేష రహితమగు బుద్ధిచే ఎట్లు వీక్షింపబడుదురో అట్లే ఈ స్వకీయ మనో బుద్ధీంద్రియ దేహాదులను కర్తృత్వము లేకుండా తమ పనులను చేయుచుండినచో అప్పుడు వాసనా రాహిత్యము, అహంకార మమత్వ వర్జనము సంభవించును. శాశ్వత సుఖ స్వరూపము అవగతమగును.

## 25వ ప్రశ్న. జ్ఞాన దృష్టి యనగానేమి?

**భగవాన్ :** ఊరకయుండుటకే జ్ఞానదృష్టి అని పేరు. ఊరక యుండుట అనగా మనస్సు ఆత్మస్వరూపమందు లయింపజేయుటయే గాని ఇతరుల తలంపుల నెరుగుట, మూడు కాలములు తెలియుట, దూరదేశములలో జరుగువాని నెరుగుట, ఆదిగాగల విజ్ఞానదృష్టి కాజాలదు.

**వివరణ :** స్వస్వరూపమందే దృష్టిని నిలుపుట జ్ఞాన దృష్టి. ఈ జ్ఞాన దృష్టి కలవాడు శుభము వలన సంతోషింపడు, అశుభము వలన దుఃఖింపడు. చిత్తేంద్రియము లను వాని వాని విషయముల నుండి మరలించును. జ్ఞాన దృష్టి కలవానికి ఇంద్రియ మనంబులు వశవర్తులై ప్రవర్తించుచుండును.

ప్రళయము సంభవించి సృష్టి మొత్తము నాశనమై, నామ రూపములు కనుమరుగైనను చిత్తము చలింపకపోవుట జ్ఞాన దృష్టి. సంకల్పము లేకుండా మనము ఎక్కడికైనా నడచి వెళ్ళునట్లు ఆత్మజ్ఞుడు సంకల్పము లేకుండా నిజ కర్మలను ఆచరిస్తాడు. ఆత్మలో ఈ ప్రపంచ ప్రవాహమంతా నడుస్తోందని ఊరక ఉన్న జ్ఞానికి తెలుస్తుంది.

కాగితముపై అక్షరాలను చూస్తారు కొంతమంది. ఆ అక్షరాలకు ఆధారమైన కాగితమును చూస్తారు మరికొంతమంది. అట్లే నామ రూపాల జగత్తును చూస్తారు మరికొందరు. జ్ఞాన దృష్టి కలవారు దానికాధారమైన ఆత్మను చూస్తారు.

**వివరణ :** సుఖము జీవుని సహజ స్వరూపము. అది బాహ్య కారణాల వలన లభించేది కాదు. సుఖము మన సహజ శాశ్వత అవినాశ స్వరూపము. సుఖానుభవము కల్గుట, కల్గకుండుట అను రెండునూ మనో వికారములు. మన స్వరూపమే సుఖము. మన స్వరూపము శాశ్వతము కూడా. అందుచేత సుఖము శాశ్వతము.

అవిద్యాంధకారమున అజ్ఞానములో ఉన్న మనస్సు ఆత్మను మరిచిన స్థితి ఆనందమయకోశము. ఇందు అజ్ఞాన వృత్తులతోపాటు ఆనందవృత్తులు కూడా ఉంటాయి. దీనికి కారణము ఈ కోశము ఆత్మానందము యొక్క ప్రతిబింబముచే స్పృశింపబడినది. ఇష్టవస్తు దర్శనము వలన కలిగే ప్రియమను వృత్తి వలనను, దానిని పొందుట వలన వచ్చే సంతోషమనే మోద వృత్తివలనను, దానిని అనుభవించుట వలన వచ్చే ప్రమోదమనే వృత్తి వలనను బుద్ధి అంతర్ముఖ మైనప్పుడు ఆనంద రూప ప్రతిబింబమును స్పృశించుచున్నది. కాని ఈ ఆనందము అస్థిరము. పరమాత్మ ప్రతిబింబ స్పర్శ లేశముచే ఇది కల్గినది.

ఇష్ట వస్తువుల వలన కలిగే బుద్ధి యొక్క ఏకాగ్రత అజ్ఞాన కృతము. కాని ధ్యాన వాహినిలో పరమాత్మ భావన స్థిరపడి బుద్ధి ఏకాగ్రమైనప్పుడు కలిగే ఆనందము పరమాత్మది. కర్తృత్వ భోక్తృత్వములను విసర్జించిన ఆనందము ఇది. నేను సుఖిని, నేను భోక్తను, నేను ఆనందరూపుడను అను వికారములు ఆత్మకు ఉండవు. స్వయంజ్యోతిగా ఊరక ఉండుటయే దాని ధర్మము.

కోశమంటేనే అప్రకాశత్వము. అంటే స్వయం ప్రకాశం లేనిది. అవి, ఇవి అనబరుగు బహుళ వృత్తులు ఒక చోట చేరి కోశముగా పిలవబడతాయి. కనుక కోశమునందు ఆనందమేదైనా వృత్తి యొక్క రూపమే. శాశ్వత సుఖము కాదు.

సుఖము లేని స్థితిని దుఃఖమంటాము. వృత్తుల నుండి సంక్రమించిన సుఖము శాశ్వతము కాదు కనుక ఆ సుఖము వెనువెంటనే దుఃఖము సంప్రాప్తించును.

సుఖమునకు స్థానము మన స్వరూపము. దానిని వదలి సుఖము కొరకు బయట వెదకుట అజ్ఞాన కార్యము.







చేతిలో రాజకీయాధికారం, సంపద, మానవజాతిని క్షణాల్లో నాశనం చేయగల ఆయుధాలు ఉన్నాయి. ఇది మొత్తం మానవజాతికే వినాశకారి. అందుచేత మన మనస్సును సంస్కరించుకోవటం మనం వెంటనే చేయవలసిన పనులలో మొదటిది. (Self enquiry is the first priority of life) అందరూ సుఖం, సంతోషం, పూర్తి రక్షణ (Security) కోసం అహర్నిశం పాటుపడతారు. ఇందులో తప్పలేదు. కాని ఆ సుఖం ఎక్కడ దొరుకుతుందో మనం విచక్షణతో ఆలోచించాలి. మనం వెంబడించే విషయాలలో సుఖమివ్వ గల పరిస్థితి ఉందా? లేదా? చూచుకోవాలి. ధనం వల్ల సుఖంవస్తే ధనం పెరిగేకొద్దీ సుఖం పెరగాలి. వాస్తవ స్థితిలో అలా లేదు. అలాగే రాజకీయాధికారం, హోదా, కీర్తి, ప్రతిష్ఠ, శాస్త్రవిజ్ఞానం వల్ల శాశ్వత సుఖం కలుగుతోందా లేక సుఖదుఃఖాల మిళితమైన జీవితం కలుగుతోందా అనేది మనం విచక్షణతో ఆలోచించవలసిన విషయం. బాగా తాగి మత్తులో ఉన్నవాడు తానెవరో మరచి, చేయకూడని పనులు చేసి, చేయవలసిన పని మాని, అనవసర ప్రసంగములు చేయును. మనమెవరో, మన స్వరూపం ఏమిటో తెలియకుండా, దైనందిన జీవితంలో మనం క్రియ సలిపితే మన పరిస్థితికూడా కొంచెం అటూ ఇటూలో అలాగే ఉంటుంది. సుఖంకోసం, శాంతికోసం పరుగులిడుతున్నాము. అశాంతిని కొనితెచ్చుకుంటున్నాము. సామాన్యంగా అందరికీ అనుభవంలో ఉన్న విషయాన్ని పరిశీలిద్దాము. జాగ్రదవస్థలో అనేక కర్మలు చేసి సుఖదుఃఖాల మిళితమైన జీవితాన్ని గడుపుతున్నాం. జాగ్రదవస్థలో ఆలోచనలు ఉన్నాయి, ఇతరులు ఉన్నారు, జగత్తు ఉంది, ఊహామాత్రంగా దేవుడు ఉన్నాడు. అనగా దేవుడు మన అనుభవంలో లేడు. ఇవన్నీ ఉన్నా తెంపులేని శాంతి (unbroken peace) లేదు అనేది అందరికీ అనుభవమే. తరువాత నిద్రపోతాము. నిద్రలో స్వప్నము వచ్చినప్పుడు కూడా మన అంతరంగంలో అనేక పొంతనలేని విషయాలను, సుఖదుఃఖరూపంలో అనుభవిస్తున్నాము. స్వప్నావస్థలో కూడా ఆలోచనలు, విషయాలు, సుఖదుఃఖాలు ఉన్నాయి. గాఢనిద్రలో మనస్సు నిష్క్రియమైనందు వలన ఆలోచనలు ఉండవు, మనస్సు నిష్క్రియమైనందువల్ల ఇంద్రియములు నిష్క్రియమయి జగత్తు గోచరించదు. మనస్సు నిష్క్రియమైనందు వలన దేహస్మృతి ఉండదు, దేహస్మృతి లేనందువలన భార్యాబిడ్డలు కాని, ధన

ధాన్యాదులుగాని, కీర్తి ప్రతిష్ఠలుగాని, లోక విషయాలుగాని, మోక్షకాంక్షగాని, దేవుని గురించిన ఊహలుకాని ఏవీ ఉండవు. ఈ సుఖం దేనివల్ల కలిగింది? ఆపాదించటానికి ఏ కారణము లేదు. కనుక మన స్వరూపమే సుఖమా అనేదాన్ని గురించి జిజ్ఞాసతో (open mind, learning mind) శ్రద్ధతో (sincere) అన్వేషణ చెయ్యాలి, సుషుప్తి సుఖాన్ని జాగ్రదవస్థలో మనం ఎందుకు అనుభవంలోనికి తెచ్చుకోలేక పోతున్నాం అనేదానిమీద క్షుణ్ణంగా, నిశితంగా, విచక్షణా బుద్ధితో పరిశీలించాలి. దేనికైనా క్షుణ్ణంగా పరిశీలించడానికి ఒత్తిళ్ళు లేని, స్వతంత్రంగా ఉండే మనస్సు (free mind, unconditioned mind) కావాలి. ప్రస్తుతం అటువంటి మనసు మనకు ఉన్నదా? ప్రస్తుతం మనం గడుపుతున్న దైనందిన జీవితంలో మనస్సు ఎల్లప్పుడూ ఒత్తిళ్ళమధ్య సంఘర్షణాత్మకంగా ఉంది (continuous state of conflict in the mind), ఇటువంటి మనస్సుతో మనం ఏ విషయమునూ కూడా సునిశితంగా పరిశీలించలేము. మనకు పరిశీలనకు అందుబాటులో ఉన్నది మనస్సు ఒక్కటే. అది ఒత్తిళ్ళ మధ్య నలుగుతోంది. ఒత్తిళ్ళు లేని, స్వతంత్రంగా ఉండే మనస్సును మొదట మనం పొందాలి. తరువాత ఆరోగ్యకరమైన మనస్సు ద్వారా విషయాన్ని పరిశీలించేందుకు వీలవుతుంది. ఆధ్యాత్మికత అంటే ఒక విషయాన్ని ఉన్నది ఉన్నట్లు పరిశీలించగలిగే సామర్థ్యం. కళంకంలేని మనస్సుని పొందటం ఆధ్యాత్మిక జీవనంలో మొదటి మెట్టు, చివరి మెట్టు. కాని దానిని పొందటం ఎలా? క్లిష్టమైన క్రతువుల ద్వారాను, పవిత్రనామం జపించటం వల్లా, ఒక నమ్మకాన్ని ఆచరించటం వల్లా, ఆలోచించటం వల్లా, భౌతిక ప్రక్రియల ద్వారానూ, శాస్త్ర పఠనం ద్వారానూ, లేక ఓ గురువు లేక రక్షకుని ప్రవచనాలను ఆచరించటం ద్వారానూ కళంకం లేని మనస్సుని పొందగలమా అనేది పరిశీలించాలి. లేదా ప్రస్తుతం మనం గడుపుతున్న జీవన విధానం అశాంతికి దారితీస్తోంది కనుక, మన జీవనవిధానాన్ని సమూలంగా మార్చుకోవాలా అనే దానిని కూడా పరిశీలించాలి. ఎవరి జీవితాన్ని వారే మలచుకోవాలి. ఎవరి మనశ్శాంతిని వారే జీవితాన్ని పరిశీలించి కష్టపడి తెచ్చుకోవాలి. అది ఇతరులు పెట్టే భిక్ష కాదు.

జీవితం అంటే ఇతరులతో మనకున్న సంబంధం. ప్రస్తుతం ఆ సంబంధం ఎలా ఉందో మనం పరిశీలించాలి. మనం మన గురించి, ఇతరుల గురించి







అవసరము. అతిగా శాస్త్రములు చదివిన వారికి ఆత్మ వస్తువు దొరకదు, సరికదా అయోమయములో పడుట తథ్యము. గ్రంథముల కంటె గురువు అనుగ్రహము వలననే సాధకునిలో నిగూఢముగా ఉన్న శక్తి మేల్కొల్పబడుతుంది.

## 24వ ప్రశ్న. సుఖమనునది ఏది?

**భగవాన్ :** సుఖమనునది ఆత్మస్వరూపమే. సుఖమును ఆత్మస్వరూపమును వేరుగావు. ప్రపంచమున ఒక్క వస్తువులోను 'సుఖము' అనునది లేదు. మనము మన అవివేకముచే వానివలన సుఖము కలుగుచున్నదని తలంచుచున్నాము. మనస్సు బయటికి పోవునపుడు దుఃఖమనుభవించుచున్నది. వాస్తవమున మన కోరికలు తీరనపుడు దుఃఖమనుభవించుచున్నది. వాస్తవమున మన కోరికలు తీరినపుడెల్ల మనస్సు యథాస్థానమునకు మరలి ఆత్మ సుఖమునే అనుభవించు చున్నది. అటులే నిద్రా, సమాధి, మూర్ఛాకాలమునందును, ఇచ్ఛగించిన వస్తువు లభించినపుడును, విరుద్ధ విషయములకు హాని అయినపుడును, మనస్సంతర్ముఖమై ఆత్మసుఖమునే అనుభవించుచున్నది. ఈ విధముగ మనస్సు ఆత్మను వదలి బయటికి పోవుటయు లోపలికి మరలుటయు ఎడతెంపు లేక చరించుచున్నది.

మ్రానిక్రింద నీడ సుఖముగా నున్నది. బయట సూర్యతాపము క్రూరముగా నున్నది. బయట తిరుగువాడు నీడకు పోయి చల్లదనమనుభవించుచున్నాడు. కొంచెముసేపక్కడ నుండి తరువాత వెలుపలికి వచ్చి ఉష్ణక్రౌర్యమును తాళజాలక మరల మ్రానిక్రిందికి వచ్చుచున్నాడు. ఈ విధముగ నీడలో నుండి ఎండలోనికి పోయి, ఎండలోనుండి నీడలోనికి వచ్చుచున్నాడు. ఇట్లు చేయువాడు అవివేకి. వివేకియో నీడను విడిచిపోడు.

అట్లే జ్ఞాని మనస్సు బ్రహ్మమును వదలదు కాని అజ్ఞాని మనస్సో ప్రపంచమందు కృషి చేసి దుఃఖపడుచు బ్రహ్మములోనికి కొంచెముసేపు మాత్రము తిరిగివచ్చి సుఖమనుభవించుచు నున్నది. జగమనునది తలంపు మాత్రమే. జగము మరుగగునప్పుడు అనగా తలంపులు లేనప్పుడు మనస్సానందమనుభ వించుచున్నది. జగము తోచునపుడు దుఃఖమనుభవించుచున్నది.

## 22వ ప్రశ్న. జాగ్రత్తకు స్వప్నమునకు భేదము లేదా?

**భగవాన్ :** జాగ్రత దీర్ఘము; స్వప్నము క్షణికమగుట తప్ప వేరు భేదము లేదు. జాగ్రత్తునందు జరుగు వ్యవహారములన్నియు ఎంత నిజముగా తోచుచున్నవో అంత నిజముగానే స్వప్నమునందు జరుగు వ్యవహారములును స్వప్నకాలమున తోచుచున్నవి. మనస్సు స్వప్నమునందు వేరొక శరీరమును దాల్చుచున్నది. జాగ్రత్స్వప్నములు రెంటిలో ఏకకాలముననే తలంపులు నామరూపములు కలుగుచున్నవి.

**వివరణ :** మనము జాగ్రదవస్థను నిజమనుకొని స్వప్నమును భ్రాంతి అనుకొంటాము. అజ్ఞానములో ఉండు ఏ అవస్థ అయిననూ నిద్రావస్థయే. జాగ్రత్స్వప్న గాఢ నిద్రావస్థలు మూడునూ భ్రాంతులే. ఆత్మలో మేల్కొన్నప్పడు ఈ మూడు అవస్థలలో ఉన్న మనో వ్యాపారము "కల"యని తెలిసికొంటాము. స్వప్నము లోని మనో వ్యాపారము క్షణికము. జాగ్రత్తులోని మనో వ్యాపారము దీర్ఘము. ఇంతియే రెంటికి భేదము.

## 23వ ప్రశ్న. ముముక్షువులకు శాస్త్రాధ్యయనము చేత ప్రయోజనమున్నదా?

**భగవాన్ :** ఏ శాస్త్రమందును ముక్తి పొందుటకు మనస్సును లోబరచుకోవలెనని చెప్పియుండుటచే మనోనిగ్రహమే శాస్త్రముల చరమ సిద్ధాంతమని తెలిసికొన్న తరువాత శాస్త్రములను తుదిలేక చదువుటచే లాభము లేదు. మనోనిగ్రహము కొరకు 'నేను ఎవడను?' అని తనలో విచారింపవలెనే కాని శాస్త్రములలో నెట్లు విచారింపనగును? తన్ను తన జ్ఞాననేత్రముచేత తానేగదా తెలిసికోవలెను? 'తాను' పంచకోశముల లోపల నున్నది. శాస్త్రములో, పంచకోశములకు వెలుపల నున్నవి. కనుక పంచకోశముల ద్రోసివైచి, విచారించి తెలియవలసిన తన్ను శాస్త్రములందు వెదకుట వ్యర్థము. ఒకప్పడు నేర్చినవాని నన్నిటిని మరవవలసి వచ్చును.

**వివరణ :** విషయాకర్షణల నుండి మనస్సును దూరము చేసికొనుటకును వైరాగ్యముతో కూడిన నిశ్చలత్వమును సాధించుకొరకును శాస్త్రాధ్యయనము కొంత







ఆలోచనలతో ఊహాప్రతిమలు (mental images) అల్లుకొని వాటితో సంబంధం పెట్టుకొంటున్నాము. నేను ఎఱుపుగా ఉన్నాను, బాగా చదువుకున్నాను, నా కుటుంబం గొప్పది, నా పిల్లలు తెలివైన వాళ్ళు, నాకు కీర్తి, ప్రతిష్ఠ, సంఘంలో పలుకుబడి ఉంది. నిర్ణీత సమయాలలో నేను దైవప్రార్థన చేస్తాను అనేవన్నీ కలిపి ఊహాప్రతిమ అవుతుంది. ఇది కేవలం మానసిక కల్పన, ఆలోచనల అల్లిక, వాస్తవంలో దీనికి అస్తిత్వం లేదు. ఒక ఊహాప్రతిమ మరొక ఊహాప్రతిమతో సంబంధం ఏర్పరుచుకొన్నప్పడు ఒక ఆలోచనా సముదాయం, మరొక ఆలోచనా సముదాయంతో సంబంధం పెట్టుకున్నట్లు మాత్రమే అవుతుంది. ఆలోచనద్వారా ఉండే సంబంధంలో ప్రేమ ఇమిడి ఉండటానికి అవకాశం ఉందా! ఆలోచన ద్వారా సంబంధం పెట్టుకున్నప్పడు, ఆ సంబంధం వల్ల కాలప్రవాహంలో సంఘర్షణ తప్పదు. దైనందిన జీవితంలో ఇతరులతో సంఘర్షణాత్మక సంబంధం ఉన్నప్పడు మనస్సు కళంకం కాకుండా ఉంటుందా? ఇతరులతో ప్రేమతో సంబంధం పెట్టుకున్నప్పడు, అసలు మానసిక సంఘర్షణ ఉంటుందా? స్వార్థపూరిత జీవనం గడిపినవాళ్ళు ప్రేమతో ఇతరులతో సంబంధం పెట్టుకొనే వీలుందా? స్వార్థపూరిత జీవనం మాని, ప్రేమతో జీవిస్తే మనకు కళంకంలేని మనస్సు సిద్ధిస్తుందా అనేది నిశితంగా పరిశీలించాలి. ప్రస్తుతం మనం మన సుఖం కోసం ఇతరులను వాడుకొంటున్నామా లేక ప్రేమిస్తున్నామా అనేది చూచుకోవాలి. "నేను" (ego) ఉన్నంతకాలం దానికి ఇతరులు ఉంటారు. 'నేను' ఊహాప్రతిమలను ఉత్పత్తి చేస్తూనే ఉంటుంది. అనగా ఆలోచనలలో అల్లిక లేక కల్పన చేస్తూనే ఉంటుంది. "నేను" (ego) ఆలోచనల అల్లిక చేసే కేంద్రం కనుక, అది ఉన్నంతకాలం ప్రేమ అనేది సాధ్యపడదు. సామాన్యంగా మనం మోహాన్ని (attachment) ప్రేమ అనుకుంటాం, మోహంలో అవతలి విషయాన్ని మనచేతిలో పెట్టుకొని (possessiveness) దాని స్వాతంత్ర్యం హరించే గుణం ఉంది. మోహంలో ఇతరుల నుండి ఏదో పొందుదాం (expectation) అనేది తప్పకుండా ఉంటుంది. ఒకవేళ వాళ్ళు అనుకున్నది పొందలేకపోతే కోపం (anger) దుఃఖం (misery) వస్తాయి. అందుచేత మోహం ప్రేమ ఎలా అవుతుంది? నిజంగా ప్రేమతత్త్వం ఉంటే అది ఏ పరిస్థితుల లోను దుఃఖానికి దారితీయదు. రోజూ మనకు కలిగే మానసిక గాయాలు

విచారణలో తగ్గి, ఆత్మలో స్థితి పొందిన తరువాత మానసికముగా గాయపడే వాడుండడు. "మిథ్యానేను" ఆలోచనల కేంద్రం కనుక, ఆలోచనల వల్ల అశాంతి, దుఃఖం వస్తోంది కనుక ఆ 'నేను' యొక్క స్వభావం గురించి విచారించాలి.

ప్రతివారు "నేను" "నేను" అనటం సర్వసామాన్యం. కాని ఈ "నేను" అనే పదం శరీరానికి సంకేతముగా వాడబడినది. అనగా సామాన్యుడు "నేను" అన్నాడంటే "నేను దేహమును" అని అతని ఉద్దేశ్యము. నీవు, వాడు అన్నప్పుడు కూడా వారి శరీరాలను దృష్టిలో పెట్టుకొని అన్నమాటలే. లోక వ్యవహారానికి ఒక శరీరానికి ఒక పేరు పెట్టబడుతుంది. కాని ఆ పేరుతో పిలిచినప్పడు అతని ప్రతిస్పందన "నేను దేహమును" అనే భావముతోనే ఉంటుంది. మొత్తం అందరూ ఇదే భావనతో ఉన్నారు కనుక, ఇది వారిలో జీర్ణించుకుపోయింది కనుక ఈ భావన తప్పు అని చెప్పినా, వారు నమ్మరు. జడమైన దేహము "నేను" "నేను" అనగలదా! మరి ఈ "నేను" అనేది ఎవరు? "నేను" అనగా "ఎఱుక"కు సంకేతం అనే అనుభవజ్ఞానం ఉన్నవాళ్ళు అరుదు. వీటన్నిటిని పరిశీలించటం విచారణలో ఒక భాగం. ఆధ్యాత్మికత దైనందిన సమస్యలకు పరిష్కారం చూపగలగాలి. ఇది విచారణ వల్ల కలుగుతుంది.

"నేను ఉన్నాను" అనేది సహజస్థితి. "నేను మానవుడను", "నేను దేహమును" అన్నప్పడు చైతన్యం (consciousness) పరిమితం అవుతుంది. ఈ పరిమితి నుండి "అపరిమిత చైతన్యము"ను చేరుకొనుటకు ఆత్మజ్ఞానము అవసరము. శ్రీ రమణుల ఆత్మవిచారణ మార్గము ఈ ఆత్మజ్ఞాన సముపార్జనకు దోహదపడుతుంది. "నేను ఎవడను?" అనే ప్రశ్న మనస్సును తన మూలమైన దైవత్వం వద్దకు తీసుకువెళుతుంది.





- 5A -



భావించు జీవుడు ప్రత్యేకముగా అనుగ్రహాన్ని పొందాలని తలుస్తాడు. ఆత్మకు అన్యవస్తువంటూ ఏమీ లేదు. ఆత్మయే అనుగ్రహ స్వరూపము. తన మనస్సుకు తాను గురువైనవాడు నిజమైన భక్తుడు, నిజమైన గురువు. మానవునిగా అవతరించిన ఈశ్వరుడు గురురూపుడై మానవుని అజ్ఞానాన్ని తొలగిస్తాడు.

కరుణ యొక్క పరమోన్నత రూపమే మౌనము. గురువు మౌనముగా ఉంటే శిష్యుని మనస్సు దానికంటే పవిత్రమవుతుంది. గురువు శిష్యుని యొక్క దోషభూయిష్టమైన దృష్టిని తనకు తానే తెలిసికొనేటట్లు చేసి అంతర్యములో ఆత్మ సాక్షాత్కారము కలిగేవరకు అతనిని సరియగు మార్గములో నడుపుతాడు. దారిలోని అడ్డంకులను తొలగిస్తాడు. సద్గురువు యొక్క దయ వలన ఇవన్నియు సిద్ధిస్తాయి. నిశ్చల మనస్సు కలిగి పరమశాంతి లభిస్తుంది. కనుక ముందుగా గురు కృప కోసము ఏకాగ్ర చిత్తముతో తీవ్ర సాధన చేసి ఆత్మ దర్శనానికి దారిని సుగమం చేసికొనాలి.

## 21వ ప్రశ్న. ముక్తిని కోరువానికి తత్త్వము విచారణ ఆవశ్యకమా?

**భగవాన్ :** చెత్త నూడ్చి పారవేయవలసిన వానికి దానిని పరీక్షించుటచేనెట్లు ప్రయోజనము లేదో అట్లే తన్నెరుంగగోరువాడు తన్ను మరుగుపరచు తత్త్వముల నన్నిటిని కూర్చి త్రోసిపారవేయక, ఇవి ఇన్నియని లెక్కించుటచేతగాని, వాని గుణములను పరీక్షించుటచేత గాని లాభము లేదు. ప్రపంచము ఒక స్వప్నము వలె తలచుకోవలెను.

**వివరణ :** తన స్వరూపమును మఱుగుపరుచు అనాత్మ తత్త్వముల విచారణ చేసేవాడు అవిద్య పట్టులో ఉన్నట్లే. అట్టి విచారణ విచారణయే కాదు. అది మనస్సును బహిర్ముఖ పరచి సాధన పేరుతో విలువైన సమయాన్ని వృథా పరుస్తుంది. అటువంటి వాటి జోలికి వెళ్ళకూడదు. తేటతెల్లమైన పద్ధతిలో "నేనెవరు" అను ప్రశ్నను గూర్చి విచారణను చేసి ఆత్మవస్తువును విశద పరుచుకొనక పోతే మనము దారి తప్పినట్లే. అవిద్య ఎచ్చట నుండి వచ్చినది? అను విచారణ మనకేల? అవిద్యను ఎట్లు నశింపచేయవలెను? అను విచారణయే నిజ విచారణ. తాను కాని దానిని మొదలంటా నాశనము చేయు విచారణ చేయాలి.

వైరాగ్యం, బోధ, ఉపరతులు పరస్పరం సంబంధించినవే అయి ఉన్నవి. వీటి వలన మనస్సు నిశ్చలమగును. దేనియందును ఆశ లేకుండుట పరవైరాగ్యము. బోధతో కూడిన వైరాగ్యము వలన సర్వదా ప్రజ్ఞను కలిగియుందుము. వైరాగ్యము వలన దేనియందును ఆసక్తి లేకుండుట, సమస్తమును తృణము వలె తలచుట నుండును. అనేక జన్మకృతపుణ్యరాశిచే వైరాగ్యము లబ్ధమగును. వైరాగ్య జ్వాలలో విషయేచ్ఛలన్నియు దగ్ధములగును. స్వస్వరూప జ్ఞానములేని వైరాగ్యము మూఢ వైరాగ్యము. నిరంతరము ప్రవర్ధమానమగుచున్న అనంత విషయేచ్ఛను, బోధయుత వైరాగ్యమనే ఖడ్గముతో ఛేదించవలెను. వైరాగ్యము నిజముగా నుండువానికి ఫలము ఆత్మజ్ఞానముదయించటమే. సకలాహంకారనాశమే బోధ.

## 20వ ప్రశ్న. భగవంతునికి గాని, గురునికి గాని ఒక జీవుని ముక్తుని చేయ సాధ్యము కదా?

**భగవాన్ :** ఈశుడు గురుడును ముక్తి చేరు మార్గమును జూపువారే గాని తామే జీవుని ముక్తిని జేర్చువారు గారు. యథార్థముగ ఈశుడును గురుడును వేఱు కారు. పులినోటబడినదెట్లు తిరిగి రాదో అట్లే గురుకటాక్షదృష్టిని పడినవారతనిచే రక్షింపబడుదురేగాని ఎన్నటికిని అతనిచే విడువబడరు. అయినను ఒక్కొక్కరును తమ ప్రయత్నముననే దైవము లేక గురుడు చూపిన దారి తొలగక అనుసరించి ముక్తిని జేరుకోవలెను. తన్ను తానే తన జ్ఞానచక్షువుచే చూచుకోవలెనుగాని ఇతరుల ద్వారా చూచుటెట్లు? రాముడు తన్ను రాముడని తెలిసికొనుట కద్దము కావలెనో!

**వివరణ :** బంధ చింత, మోక్ష చింత మనస్సునకు సంబంధించినవి మాత్రమే. కనుక జీవుని మనస్సులో బంధమునుండి విడివడుటకు తీవ్ర ఆరాటం కావాలి. గురువు సహాయము అనుగ్రహ రూపములో ఎల్లప్పుడూ ఉంటుంది. మనస్సును బంధ భ్రాంతి నుండి తొలగించుటకు గురువు దారి చూపినపుడు మోక్ష భ్రాంతి కూడా తొలగి మనకు స్వరూపము ఎఱుకపడును.

అజ్ఞాని ఒసంగిన ఉపదేశము వాగ్రూప సంకల్ప కళంక యుక్తమై ఉండును. జ్ఞాని ఒసగు ఉపదేశము వాగ్రహితమై ఉండును. శరీరమే తానని







# ఆత్మజ్ఞానమెందుకు అవసరము?

ప్రస్తుతము మనము అజ్ఞానముగా ఉన్నందువల్ల భేదబుద్ధి కలిగి, ఇతరులు జగత్తు మనకు విడిగాను, వ్యతిరిక్తముగా ఉన్నారనే భ్రాంతి వల్ల నిత్య సంఘర్షణ మనస్సులో కలుగుచున్నది. అజ్ఞానమువల్ల సుఖము బాహ్యముగా నున్నదని తలచి, కోరికలుదయించి విషయాకర్షణ కలిగి, విషయములను వెంబడించి తుదకు దుఃఖము కొనితెచ్చుకొంటున్నాము. అందుచేత అజ్ఞానమే దుఃఖమునకు హేతువు. దుఃఖము నశించాలంటే అజ్ఞానము నశించాలి. అజ్ఞానము నశించాలంటే ఆత్మజ్ఞానము కలగాలి. అజ్ఞానముతో జోడింపజేసిన కర్మల వల్ల వాసనలు ఏర్పడి పునర్జన్మహేతువులై అంతులేని జన్మ మరణ చక్రమనే సంసారములో ప్రతి జీవుడు చిక్కుకొంటున్నాడు. అజ్ఞానమున్నంతవరకు భగవద్భక్తి కూడా ఫలాపేక్షతో కూడి, షరతులతో కూడిన సంబంధం భగవంతునితో ఏర్పరచుకోవాలని చూస్తారు. మన శ్రేయస్సు గురించి అనంత చైతన్యవంతుడైన భగవంతునికి తెలుసా లేక పరిమిత ఎఱుక కలిగి వ్యావహారిక జ్ఞానం (knowledge of the phenomenal reality) గల మనకు తెలుసా!

కర్మ యొక్క స్వభావము, కర్తృత్వము వల్ల ఉన్న కర్మఫలాపేక్ష జీవుని బంధించు విధానము, కర్మఫల త్యాగము పొందుకుశలత (skill) ఆత్మజ్ఞానం పొందిన తరువాతే తెలుస్తుంది.

అనంతమైన కోరికల వల్ల వాసనలు ఏర్పడి అవి మోక్షమునకు ప్రతిబంధకమని ఆత్మజ్ఞానం కలిగిన తరువాతే తెలుస్తుంది. వాసనా క్షయమునకు, మోక్షమునకు గల అవినాభావ సంబంధం ఆత్మజ్ఞానం కలిగినప్పడే తెలుస్తుంది.

ఆత్మజ్ఞానము కలిగిన పిదప మనస్సు విషయముల వెంట వెంబడించుట మానినపుడు అది అంతర్ముఖమై ఆత్మలో స్థితి పొందుతుంది. మనస్సు ఎల్లప్పుడూ, నిరాటంకంగా ఆత్మలో స్థితిపొందటమే మోక్షము. ప్రాపంచిక భోగముల యొక్క అశాశ్వతత్వము, మోక్ష పదము యొక్క శాశ్వతత్వముపై సంపూర్ణమైన అవగాహన కలుగును.

నామరూపాత్మక జగత్తు బ్రహ్మ స్వరూపమని ఆత్మజ్ఞానం కలిగిన తరువాతే తెలుస్తుంది.

ఆత్మానాత్మ వివేచనము ఆత్మజ్ఞానము కలిగిన తరువాతే తెలుస్తుంది.

విశిష్ట కర్మ, విశిష్ట భక్తి ఆత్మజ్ఞానము కలిగిన తరువాతే మనకు అవగాహనకు వస్తాయి. విశిష్ట భక్తి అంటే భగవంతుడు తనకు భిన్నము కాదనే స్థితి. విశిష్ట కర్మ అంటే మనము దేవుని చేతిలో పనిముట్టు మాత్రమే అని అనుభవ పూర్వకముగా గ్రహించి, నిష్కామ కర్మ చేసి, కర్మఫలమును ఈశ్వరార్పణ చేయుట, కర్మను చేయుటకే మనకు అధికారమున్నది. కర్మఫల దాత కేవలము ఈశ్వరుడే.

ఆత్మ జ్ఞానము కలిగిన తరువాత కేవలదేహాధ్యాసము వల్ల కలిగిన అహంభావము లేనివస్తువని తెలిసి, నశించి, బుద్ధికి ఆత్మధ్యాస కలిగి, అంతః కరణము ఆరోగ్యకరముగా పనిచేయును.

కర్మసాధనవల్ల తమోగుణము తగ్గును. ఆత్మ జ్ఞాన సాధన వల్ల రజోగుణము తగ్గును. విశిష్ట జ్ఞానము అనగా మనస్సు ఎల్లప్పడూ ఆత్మలో స్థితి పొంది మనోనాశనమగుట వలన సత్వగుణము కూడా నశించును. అవిద్యా కోశము కేవలము ఆత్మజ్ఞానము వల్లే నశించును.

"నేను దేహమును మాత్రమే" అను అజ్ఞాన వృత్తి ఆత్మజ్ఞానము వలననే తొలగును.

కావున మోక్షప్రాప్తికి ఆత్మజ్ఞానమే శరణ్యము.



- 6A -



కాంతిని, అమితానందాన్ని ఒక్కసారి మనస్సులో అనుభవించినట్లైతే ఆ మధుర స్మృతి ఎప్పడూ స్థిరముగా ఉండిపోతుంది.

మన చైతన్య నదీ ప్రవాహము వివేకము, వైరాగ్యము అనే గట్ల వల్ల శుద్ధ చైతన్య దిశగా ప్రవహించాలి. తుట్టతుదకు శుద్ధ చైతన్య సాగరములో కలసి దానితో ఏకమవుతుంది. అప్పడు నది సముద్రమవుతుంది, రాగి బంగారమవుతుంది, జీవుడు శివుడవుతాడు, మానవుడు మాధవుడవుతాడు.

మనస్సులో పుట్టుచున్న ఒక్కొక్క ఆలోచనను దాని మూలముననే నాశనము చేయాలి. అంటే దానిని దుంపనాశనము చేసి కలుపుమొక్కవలె ఏరి పారవేయాలి. ఆ విధముగా చేయాలనే సంకల్పము వైరాగ్యము కల్గినప్పడే కల్గుతుంది. అసలు అట్టి సంకల్పమే వైరాగ్యము. ఒక్కొక్క తలంపును ఆ విధముగా మూలములోనికి వెళ్ళి నాశనము చేసిననాడు తలంపుల మొలకలు నాశనమవుతాయి; కనుక క్రొత్త తలంపులు పుట్టవు. అవి పుట్టుచున్న మూలముపై మనస్సు నిలచి మనోమూలమైన "తాను" ప్రకాశిస్తుంది.

బాహ్య వస్తువులందు ఆసక్తి లేకుండుట వైరాగ్యము. ఆంతరిక వస్తువులగు అహంకారాదుల యందు సంగమము లేకుండుట పరవైరాగ్యము. అనగా వైరాగ్యము మనస్సులో జరగాలి. అంతేకాని స్వధర్మాన్ని విడిచిపెట్టి భౌతిక పరిసరాలను మార్చుకోవటం కాదు. మనస్సు విషయాకర్షణ లేకుండా బహిర్ముఖం కాకుండా చూచుకోవటమే వైరాగ్యము. ఇంటిని, ఇల్లాలిని వదలుట వైరాగ్యము కాదు. అంతస్సంగమములు, బాహ్య సంగమములు పరిత్యజించటమే నిజమైన వైరాగ్యము. అనాత్మను విడిచిపెట్టటమే వైరాగ్యము. తన అహంకారాన్ని విడిచి పెట్టటమే వైరాగ్యము. మనము దేహముతో తాదాత్మ్యం చెందకుండా దీని కర్మ వల్ల జరిగే సుఖదుఃఖాలను అంటకుండా తటస్థంగా ఉండటం వైరాగ్యము. (choiceless awareness, witnessing consciousness) సంగి పురుషుడు బద్ధుడగు చున్నాడు. నిస్సంగి సుఖియగుచున్నాడు. అందుచే సుఖమును కోరువాడు అనాత్మతో సంగమును త్యజింపవలెను. సకల సాధనలోను వైరాగ్యమే ప్రధానము. వైరాగ్యము, బోధ ఉన్నప్పడు జీవుడు పక్షివలె అనాత్మ కొండలను దాటిపోవును.

మోక్ష కారణ సాధనములతో అంతరంగమునందు భక్తి శ్రేష్ఠమైనది. నిరంతర స్వస్వరూపానుసంధాన చింతనమే భక్తి. అది అనన్య భక్తి. అట్టి భక్తియే సత్వరముగా భగవదనుగ్రహమును కల్గించును. భగవంతునిపై బాధ్యత వేసినపుడు విధి ఏమి చేస్తుంది?

భగవంతుడు తన కంటె భిన్నముగా లేడని బ్రహ్మానుభూతి పొంది నిరంతరము బ్రహ్మలో రమించుట విశిష్ట భక్తి. ఎవ్వని మనస్సు విచారణచే స్తంభింపబడి సద్వస్తువగు ఆత్మ నుండి విషయముల వైపు ఏ మాత్రము చలింపకుండునో అతడే ఉత్తమ భక్తుడు.

## 19వ ప్రశ్న. వైరాగ్యమనునది ఏమి?

**భగవాన్ :** ఏయే తలంపులుత్పత్తి యగునో వానిని సకలమును ఒక్కటి విడువక ఉత్పత్తి స్థానములోనే నశింపజేయుటయే వైరాగ్యము. ముత్తెము దెచ్చువారొడి యందు రాలను గట్టికొని మునిగి సముద్రపుటడుగున నుండెడు ముత్యముల నెటుసంగ్రహింతురో, అట్లే ఒక్కొక్కడును వైరాగ్యముంబూని తనలో లోతుగ మునిగిన ఆత్మ ముత్యముంబొందగలడు.

**వివరణ :** విషయాకర్షణ లేని వైరాగ్యము గల మనస్సే ఆత్మలో స్థితి పొందగలదు. విషయములలో దుఃఖమున్నదని ఆత్మలో అమితానందమున్నదని మనస్సుకు తోచినపుడు అది ఆత్మ స్థానమును వీడదు. ప్రస్తుతము అంతఃకరణముతో తాదాత్మ్యము పొంది దానితో అభేదముగా ఉన్న చిదాభాసుడు (జీవుడు) వైరాగ్యము వలన ఆ అంతఃకరణ తాదాత్మ్యమును వీడి తనకు మూలమైన శుద్ధ చైతన్యములో మునుగుతాడు. అట్టి స్థితిలో మనకు అమితానందము కలిగి మనస్సు ఉన్మనీ భావము చెందుతుంది. కొంతసేపటి తరువాత బాహ్య స్మృతి వచ్చినప్పటికి శుద్ధ చైతన్యపు కాంతిని, అమితానందాన్ని మనస్సు ఎప్పటికీ మరచిపోదు. వ్యావహారిక కార్యములతో ఉన్నప్పటికి శుద్ధ చైతన్యముతో తాను ఏకముగానున్నప్పటి స్వరూపానందానికి సంబంధించిన మధుర స్మృతి ఎప్పుడూ గుర్తుకు వస్తూనే ఉంటుంది. ప్రవహించు నదికి పైన ఉన్న నీరే కదులుతుంది. క్రింద ఉన్న నీరు స్థిమితంగా ఉంటుంది. అట్లే ఎన్ని పనులు చేసిన మనిషికైనా, శుద్ధ చైతన్యపు







చిదంబరం దగ్గర ఊరు "ఇడయన్ పాల్బోరి" నివాసి శ్రీ శివప్రకాశం పిళ్లై వినయముతో తనకున్న సందేహములను నివృత్తి చేసుకొనుటకు 1902లో భగవాన్ శ్రీ రమణ మహర్షిని దర్శించుకొని 13 ప్రశ్నలను అడిగెను. భగవాన్ అప్పడు మౌనముగా నుండి సంజ్ఞలతోను, పలకపై వ్రాసి ఉత్తరములిచ్చెను. ఇపుడనుబంధ ప్రశ్నలతో కూడి 28 ప్రశ్నలైనవి. వాటికి భగవాన్ సమాధానములు క్లుప్తంగా, భావగర్భితంగా ఉన్నందువల్ల సామాన్య భక్తులకు ఈ సమాధానములలో ఉన్న సారము తెలియుటలేదు. ఈ పుస్తకములో భగవాన్ సమాధానములకు సాధారణ భక్తులకు అర్థమయ్యే విధంగా వివరణ ఇచ్చే ప్రయత్నం జరిగినది.

## ప్రశ్న 1. నేనెవడను?

**భగవాన్ :** సప్తధాతువులచే నేర్పడిన స్థూలదేహమును 'నేను'గాను. శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను పంచవిషయములను వేర్వేరుగ తెలిసికొను శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వ, ఘ్రాణములను జ్ఞానేంద్రియములయిదును 'నేను' గాను.

వచన, గమన, ఆదాన, మలవిసర్జన, ఆనందములను నైదు కార్యములను జేయునట్టి వాక్కు, పాద, పాణి, పాయు, ఉవస్థలను కర్మేంద్రియములైదును 'నేను'గాను. శ్వాసాది పంచవ్యాపారములను జేయు ప్రాణాది వాయుపంచకమును 'నేను'గాను. తలచెడి మనస్సును 'నేను' గాను. విషయవాసనలతో మాత్రము గూడి, సర్వ విషయములను సర్వ వ్యాపారములను వదలియుండు అజ్ఞానమును 'నేను'గాను.

**వివరణ :** సాధారణముగా మన దేహానికి సంకేతముగా "నేను" అనే పదాన్ని వాడతాం. నీవు, వాడు అను పదాలు కూడా దేహాలకు సంకేతాలే. కాని ఆత్మజ్ఞానం కలవారికి వారు దేహము మాత్రమే కారని ఎఱుకలోకి వస్తుంది. ఆత్మ కానిది మరి ఏదీ కూడా వారి స్వరూపము కాదని తెలుసుకొంటారు. ఎఱుకయే తమ స్వరూపమని వారు నిర్ద్వంద్వంగా తెలుసుకొంటారు. ఇట్టి ఆత్మజ్ఞానము కలవారు కోటికి ఒక్కరు కూడా ఉండకపోవచ్చు. మిగిలిన అందరు తమ స్వరూపము దేహమే అనుకుంటారు. కనుక వారు దేహము కాదని, దేహం మొదలుగా

అజ్ఞానము వరకు ఉన్న అనాత్మ అంతా తమ స్వరూపం కాదని తెలియజేయవలసి ఉన్నది.

ఇది ప్రస్తుతానికి మేథోపరంగా, సిద్ధాంతపరంగా అవగాహనకు తెచ్చుకొని విచారణ చేయగా, చేయగా ఈ "నేను" యొక్క అసలు స్వరూపం తాలూకు అపరోక్షానుభూతి కలుగుతుంది. మన స్వరూపాన్ని సాపేక్షంగా ఇతరులకు చూపించటానికి వీలుపడదు కనుక, ఏది మన స్వరూపము కాదో చెప్పగలము.

దేహం మొదలు అజ్ఞానము వరకు గల అనాత్మ సంఘాతంలో విడివిడిగా దేహముతో ఒకసారి, మనస్సుతో ఒకసారి, బుద్ధితో ఒకసారి, ప్రాణముతో ఒకసారి, అజ్ఞానముతో ఒకసారి ఇలా దఫదఫాలుగా తాదాత్మ్యము తొలగడమనేది కాకుండా, మొత్తం అనాత్మతో తాదాత్మ్యం రెప్పపాటులో ఒకేసారి తొలగుతుంది. అప్పుడు బుద్ధికి మన స్వరూపం ఆత్మ అనే నిశ్చయ జ్ఞానం కలుగుతుంది.

బుద్ధికి ఆత్మ మన స్వరూపమనే నిశ్చయజ్ఞానం కలిగినప్పటికీ యుగ యుగాలుగా మనల్ని వెంబడిస్తున్న వాసనలు స్వరూప జ్ఞానాన్ని కమ్మివేస్తాయి. కాని ఆత్మానందాన్ని మనస్సు ఒకసారి రుచి చూసాక దానిని శాశ్వతంగా పొందడానికి తన సర్వశక్తులను వినియోగించి ప్రయత్నం సాగిస్తుంది. "నేనెవరు?" అనే విచారణ ఇందుకు సాయపడుతుంది.

"నేనెవరు?" అనే విచారణ నన్ను నేను తెలుసుకొనుటకు కాదు. నేను కానిది ఎవరో దాని నుండి తాదాత్మ్యం వదలుకొనుటకు, అనాత్మ నుండి తాదాత్మ్యం తొలగించుకొన్ననాడు "నేను" మిగులుతుంది.

ఒక శిల్పకారుడు ఒక శిల్పాన్ని చెక్కేటప్పుడు రాతిపై ఉలిని పెట్టి శిల్ప చిత్రము కానిదానినంతనూ తొలగించి వేస్తాడు. శిల్పము మిగులుతుంది. శ్రీరమణుల విచారణ విధానము ఇదియే.

లోకవ్యవహారంలో ఒక శరీరానికి ఒక పేరు పెట్టబడుతుంది. కాని ఎవరైనా అతనిని ఆ పేరుతో పిలిచినప్పుడు దేహాత్మభావంతో ఉన్న అతడు పలుకుతాడు. మొత్తం అందరు ఇదే భావముతో ఉన్నారు కనుక, ఈ భావన తప్పు అని చెప్పినా వారు నమ్మరు.







చిత్స్వరూపము ఏక వస్తువు (unitary being). దానికి తనను తాను బహుళమొనర్చుకొని ఆ బహుళమును తెలిసికొనాలనే లీలా విలాసము (whim) కల్గినప్పుడు పంచాకాశములు సృష్టింపబడతాయి. ఇవి బ్రహ్మమునకు, చిత్స్వరూపమునకు తొడుగులు వంటివి. ఒకే చెట్టు యొక్క కర్ర నుండి అనేక విగ్రహములు తయారుచేయబడునట్లు ఒకే పంచభూత సముదాయము నుండి జగత్తు వేరువేరుగా నిర్మింపబడినది. ఈ జగత్తులో ప్రతి అణువునందును చిత్స్వరూపము కూరుకొనిపోయి ఉండును. ఇట్లు కూరుకొని ఉండిన చిత్స్వరూపము దేహ ప్రకృతిలో ఉండగానే ఎఱుకతో కూడిన అమృతత్వాన్ని సిద్ధింప చేసికొనుట సృష్టిగా పరిణమించుట యొక్క ఉద్దేశ్యము.

## 18వ ప్రశ్న. భక్తులలో ఉత్తమ భక్తుడెవరు?

**భగవాన్ :** స్వరూపమైన భగవంతునియందు ఎవడు తానే తనను అర్పణము చేసికొనునో అతడే భక్త శ్రేష్ఠుడు. ఆత్మచింతనము తప్ప ఇతర చింతలు పుట్టుటకు కొంచెమైనను తావీయక ఆత్మనిష్ఠాపరుడై యుండుటయే తనను ఈశ్వరున కర్పించుకొనుట. ఈశ్వరునిపై ఎంతభారము మోపినను దానినంతటిని అతడు వహించుచున్నాడు. సకల కార్యముల నొక పరమేశ్వర శక్తి నడపుచుండుటచేత మనమును దానికి లోబడియుండుట మాని, "ఇటు చేయవలెను. అటు చేయవలెను" అని సదా చింతించుచుండుటేల? పొగబండి సకల భారములన్నిటిని మోసికొనిపోవునని తెలిసియున్నను, దానిలో నెక్కిపోయెడు మనము, మన చిన్న మూటనందు పడవైచి సుఖముగ నుండక, దానిని మన తలపై పెట్టుకొని ఏల కష్టపడవలెను?

**వివరణ :** అంతఃకరణము, దేహము, పనిముట్లు, అజ్ఞాన జనితమైన అహంభావము పనిని తన మీద ఆరోపించుకొని కర్తృత్వ భ్రాంతిని పొందుచున్నది. ఆత్మ సన్నిధి వలన మాత్రమే అంతఃకరణము, దేహము పనిచేయుచున్నవని తెలిసికొని ఆత్మకు శరణాగతి పొందుట పరాభక్తి. పరాభక్తియే నిజమైన భక్తి. మనము అది చేయవలెను, ఇది చేయవలెను అనుకున్ననూ జరిగేది ఈశ్వర సంకల్పమే. అందువలన ఊరక ఉండుటయే భక్తి, జ్ఞానము.

జగజ్జీవేశ్వరుల కల్పన అజ్ఞాన కార్యము. ఆత్మే అజ్ఞానము వలన జగజ్జీవేశ్వరులుగా తోచుచున్నది. భ్రాంతిని విడిచి దేహాత్మాభిమానమును పరిపూర్ణముగా వదలుటయే బోధ యొక్క ఫలము.

సృష్టి యనగా నామరూపములను ప్రకాశింపచేయుట. అంతేకాని ఈశ్వరుని కంటె వేరుగా మరొకదానిని కల్పించుట అని అర్థము కాదు. ఈశ్వరునకు స్వయంగా అనేక నామరూపములు కలవాడుగా కనబడవలెనని లీలా విలాసము (whim) కలుగును. ఆ లీలా విలాసము పరిపూర్ణమగుటకు మలిన సత్త్వప్రధానమగు అవిద్యను ప్రేరేపించును. దాని సహాయము లేకయే కర్మలు మాత్రము కార్యమును సాధింపనేరవు కదా! అచిత్తు ఈశ్వరునకు క్రీడా పరికర మగుటచే దానిని "లీలా విభూతి" అందురు. మాయ అంటే లేనిది అని అర్థము. అది చేయు కార్యములు అనిత్యములు. భ్రాంతికి సంబంధించినవి. వాటి సారము శూన్యము. అందువలన మాయాకార్యమైన ఈ సృష్టి లేనిది. దాని సారము శూన్యము. సృష్టి విధానములో బుద్ధి వికాసానికి ప్రయోజనము ఆత్మాన్వేషణకు దారి చూపటమే.

ఉన్నది ఒక్కటే వస్తువు. అదే ఆత్మ. రెండవదంటూ ఏమీ లేదని భగవాన్ శ్రీ రమణ మహర్షి అనుభూతి పొంది మనకు బోధించారు. కాని మనకు భేద బుద్ధి వల్ల ప్రపంచము అనేకత్వముగా (multiplicity) గోచరించి, అన్యముగానూ, వ్యతిరిక్తముగానూ ఉన్నట్లు తోస్తోంది. వాస్తవముగా మనకు గోచరించునది భిన్నముగా ఉన్న ప్రపంచము కనుక ఆధ్యాత్మికానుభూతి పొంది చెప్పిన వారి బోధను మనము సరళముగా అవగాహన చేసికొనలేకపోవుచున్నాము. మనస్సులో గందరగోళము కలుగుచున్నది. ఇది నివృత్తి చేసేందుకు కొంత శాస్త్ర పరిశీలన అవసరము.

సర్వము చిత్స్వరూపమే. అచలముగా ఉన్న చిద్వస్తువును చైతన్య మంటారు. సచలముగా ఉన్న చిద్వస్తువును శక్తి అంటారు. శక్తి ద్వారా చైతన్యము క్రియ సల్పుతుంది. అంటే చైతన్య సన్నిధి మాత్రమున క్రియలు వాటికవే జరుగుతాయి.







సామాన్యంగా మనము ఇది నా కాలు, ఇది నా కన్ను, ఇది నా దేహము అంటాము. దేహం మనకు విడిగా ఉన్నందువల్లే మనం అలా అంటున్నాము. కనుక దేహము మనము కాదు. దేహము ఉత్పత్తి వినాశములు కలది. పుట్టుట, ఒకప్పుడు మాత్రమే ఉండుట, పెరుగుట, మార్పు చెందుట, క్షీణించుట, తుదిని లేకుండుట లేక మరణించుట అనే షడ్భావ వికారములు కలది శరీరము. అందుచేత శరీరము మనము కాదు. "నేను" అంటే "ఎఱుక"కు సంకేతము. ఇది శాశ్వతముగా ఉండేది. దేహమునకు శాశ్వతత్వము లేదు. దేహానికి చెందిన ఇంద్రియములతో మనస్సు కలిసి ఉన్నప్పుడు ఇంద్రియ వ్యవహారములు జరుగును. ఇది జాగ్రదవస్థలోనే సాధ్యము. సుషుప్తిలో మనస్సు నిష్క్రియమై ఉండును గాన ఇంద్రియ వ్యాపారము సాధ్యము కాదు. ఇది సామాన్యునికి కూడా అనుభవమే. జాగ్రత్తులో ఉండి, సుషుప్తిలో ఉండని ఇంద్రియములు మనము కాదు.

ఇది నా మనస్సు, ఇది కలతగా ఉన్నది లేక శాంతముగా ఉన్నది అని మనకు తెలుస్తున్నది. కనుక మనస్సు కూడ మనకొక విషయము మాత్రమే. మనము సాక్షిగా ఉండి మనస్సుతో తాదాత్మ్యం లేకుండా మనస్సును విషయముగా చేసి దానిని గమనించాలి. అప్పుడు ఈ మనస్సు నియమరహిత స్వభావం కలదని, వికారియని, కామ, క్రోధాది గుణములు కలదని మన అవగాహనలోనికి వస్తుంది. వీటన్నింటికీ సాక్షిగా మనం ఉన్నందువలన మనస్సు మనము కాదు.

బుద్ధి మందగించినది, లేక చురుకుగా ఉన్నది అని మనకు తెలుస్తున్నది. ఇది సుషుప్తిలో లయమై, జాగ్రత్ స్వప్నములలో గోచరించుచున్నది. ఈ బుద్ధికి కూడా మనము సాక్షిగా ఉంటున్నాము. కనుక బుద్ధి కూడా మనము కాదు.

ఈ పైన చెప్పిన దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలైనవన్నీ అజ్ఞానము నుండి వెలువడినవే. ఆ అజ్ఞానమునకు తన రూపమేదో తనకు తెలియదు. నేను దేహమును అనే అహంభావమునకు అజ్ఞానము మూలం. అట్టి అహంభావము కూడ నేను కాదు.

ఆనందమయకోశమునకు బింబ భూతాత్మానందాత్మ "నేను". వీనికి అభిన్న సంబంధము ప్రతీతము. కాని అవియును భిన్నములే. ఇది అగ్నికి,

లోహమునకు గల సంబంధం వంటిది. అట్లే అంతఃకరణము, జీవుడు అభిన్నములుగా ప్రతీత మైనను భిన్నములే యగును.

కనుక ప్రపంచ వ్యవహార సర్వస్వము ఆత్మజ్ఞానముచే బాధితము. ఇది ఏది మనము కాదు.

మనస్సు, ప్రాణము, దేహములు మొదలైనవి జ్ఞాతచే తెలుసుకొనబడు చున్నవి. తమను తాము తెలుసుకొనలేవు. వీనిని తెలుసుకొనే చైతన్యము “నేను”. ఈ చైతన్య సాన్నిధ్యము వలన చిదాభాసునితో కూడిన అహంకార, ప్రాణ, చిత్త, జ్ఞాన, కర్మేంద్రియములు వాని వాని కార్యములందు ప్రవర్తించుచున్నవి.

నిత్యానిత్యవిచారదృష్టితో, చైతన్యమును అనాత్మ నుండి వేరు చేసినప్పడు పరబ్రహ్మ ప్రకాశించుచూ మిగులును.

మనకు ఎఱుక గోచరించినప్పడు, అపరోక్షానుభూతి కలిగి, మన చైతన్య స్వరూపము దృఢమై మనకు తోచినప్పడు, మానసాది ఇంద్రియ సమూహము అంతఃర్ముఖమగును. తమయందున్న ప్రకాశము బ్రహ్మ ప్రకాశమే, అను జ్ఞానము వానికి కలుగును. వానికి పరమానందము అనుభవములోనికి రాగానే విషయ వాంఛ నశించును. భ్రాంతి వల్ల బ్రహ్మమే ప్రపంచముగా గోచరిస్తున్నదని అనుభూతమగును.

సూదంటురాయి సన్నిధిలో ఇనుప ముక్క అయస్కాంత శక్తితో కదలును. సూదంటురాయిలో మాత్రము ఎట్టి మార్పు ఉండదు. అదే విధముగా “నేను” సాన్నిధ్యములో సకల మనోవ్యాపారము జరుగు చుండును. “నేను” మారదు. అట్టి “నేను”ను తెలిసికొనుటయే విచారణ గమ్యము. “నేనెవరు?” అను ప్రశ్నకు సమాధానము తానుగా స్వరూపము గోచరించుట.

## ప్రశ్న 2. పైన చెప్పినవన్నియు “నేను” గానినచో, అప్పడు నేనెవడను?

**భగవాన్ :** వీనినన్నిటిని (‘నేతి’) కాదని ప్రత్యేకముగ నిలుచు ఎఱుకయే ‘నేను’.

**వివరణ :** పైన చెప్పిన వాటన్నింటికి “ప్రకాశాన్ని” ఇచ్చి అవి మనకు తెలిసేలాగ చేసేది “నేను”.







మేఘము మాయ అనుకొంటే దానిలో ప్రతిబింబించిన బ్రహ్మమనెడు సూర్యుడు ఈశ్వరుడు. అందుచేత ఈశ్వరుని యొక్క ఉపాధి మాయ. మేఘము నుండి జ్వలించిన జలము కుండలో నింపితే బ్రహ్మము అందు ప్రతిఫలించినపుడు ఏర్పడిన ప్రతిబింబము జీవుడు. కుండలోని జలమునకు గల గుణములు మాయ యొక్క గుణములు. ఈశ్వరుని ఉనికి జగత్తునకును, జీవునకును ఉనికిని ప్రసాదించుచున్నది. ఈశ్వరుడు ఉన్నప్పడే ఇవి ఉండును. జగజ్జీవేశ్వరులు కల్పనామాత్రులు. ఇవి అన్నియు కలిసియే వ్యవహరిస్తాయి. కలసియే అదృశ్యమవుతాయి.

## 17వ ప్రశ్న. సర్వము ఈశ్వర కార్యమే కదా?

**భగవాన్ :** ఆదిత్యుని సన్నిధిమాత్రముచేత సూర్యకాంతపురాయి అగ్నిని వెలిగ్రక్కుట, కమలములు వికసించుట, నీళ్లింకుట, లోకజనులు తమ తమ పనులలో వర్తించి వానిని జేయుటయు, తర్వాత మానుటయు, కాంతమునెదుట సూదికదలుటయు వలె, ఈశుని యిచ్ఛా, సంకల్ప, యత్నములవలనగాక సన్నిధి విశేషమాత్రమున జరుగుచున్న సృష్టి స్థితి సంహారములను మూడు వృత్తులకును లేదా పంచకృత్యములకును లోబడిన జీవులు తమ తమ కర్మానుసారము చేష్టించి, తర్వాత చేష్టలు మానుచున్నారు. అంతేగాని ఈశుడు సంకల్పసహితుడు గాడు. ఏ కర్మ అతనిని అంటదు. అది, లోక కర్మలు సూర్యుని తాకకుండుటకును, అంతట వ్యాపించు ఆకాశమును కొదమ నాలుగు భూతముల గుణావగుణములు అంటకుండుటకును పోలియున్నది.

**వివరణ :** శుద్ధ సత్వమైన మాయలో బ్రహ్మము ప్రతిబింబించినపుడు ఈశ్వరు డందురు. భగవంతుడు లేక మాయ లేక శక్తి అనబడేవి పరమాత్ముని క్రియాశక్తికి సంబంధించినవి. పరిమిత బిందువునకు ఆత్మ విస్మృతి కలిగి రజస్తమో గుణములతో మలిన సత్వము కాగా రజోగుణము అంతఃకరణముగను, తమోగుణము దేహము, ప్రపంచముగను తోచును.

ఈశ్వర సాన్నిధ్యము వలన అజ్ఞానము సృష్టికార్యము సల్పును. ఈశ్వరుడు సంకల్పము లేకుండా వీక్షణ మాత్రము చేతనే సృష్టి కల్పిస్తాడు.

చనిపోవుటల వంటి షడ్భావ వికారములు దీని స్వభావము కాదు. ఒకప్పడు ఉండి మరొకప్పడు లేకుండుట అనెడి ఆవిర్భావ తిరోభావములు లేని మహా పదార్థమిది. కాలబద్ధము కానిది. అందువల్ల సనాతనమైనది. నిర్గుణమైనది ఇది. దీనికి త్రివిధ పరిచ్ఛేదములు లేవు. అనగా ఒకచోట ఉండి మరొకచోట లేకపోవుట, ఒకప్పడు ఉండి మరియొకప్పడు లేకపోవుట, ఒక వస్తువునందు ఉండి మరియొక వస్తువునందు లేకపోవుట దీనికి లేవు.

ఇది సర్వ వ్యాపకము. అనంతమైన చైతన్యము. చైతన్యమంటే తానున్నానని తనకు తెలియడం. జడ వస్తువులకు ఆ ధర్మముండదు. వాటి ఉనికిని తెలియడానికి తెలియజేయు మరొకదాని సహాయము కావాలి. ఇది సచ్చిదానంద స్వరూపము. ఆది భౌతికము, ఆధి దైవికము, ఆధ్యాత్మికము అను మూడు విధములైన దుఃఖములు దీనికి లేవు. దీనికి సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేవు. ఇది అవిభాజ్యము, అఖండము, అపరిచ్ఛిన్నము, కాలము చేత విభజింపబడనిది ఇది ఒక్కటే. రెండవది లేని సద్వస్తువు. తనకు వేరొక కారణము లేని వస్తువు. దీనికి అవస్థా త్రయము లేదు. సంకల్ప వికల్పాలు లేవు. స్వయం ప్రకాశము. ఇది సర్వవ్యాపకము కనుక సాధకునకంటె భిన్నముకాదు. దీనిని అనుభవించవలెను, అంతే. ఇది సాధింపదగినది, పొందదగినది కాదు. పొందవలసిన వస్తువు ఎప్పడూ పొందు వ్యక్తి కంటే వేరుగా ఉండవలెను కదా! ఏది ఎవరికంటే భిన్నము కాదో దానిని వాడు పొందుట అను భావము లేదు.

బ్రహ్మ యొక్క స్వరూపము ఇట్టిది అట్టిది అని తెలియబడదని ఎఱిగిన వాడు జ్ఞాని. ఇది అనిర్వచనీయము. దీని స్వరూపము మౌనము మాత్రమే.

మందార పుష్పము స్ఫటికము సమీపమున ఉండినప్పడు పుష్పము యొక్క సంయోగము వలన స్ఫటికము రక్త వర్ణము కల్గియుండును. వియోగమైనప్పడు రక్త వర్ణము భాసిల్లదు. కనుక రక్తవర్ణము స్ఫటిక ధర్మముకాదు. స్ఫటిక ధర్మమనుకొనుట భ్రాంతి. అట్లే చిదాభాసుడు (జీవుడు) అంతఃకరణముతో తాదాత్మ్యత చెంది కర్తృత్వ భోక్తృత్వములను వహించును. సుషుప్తిలో ఇవి ఉండవు. ఆత్మయే అజ్ఞాన కార్యము వలన జగజ్జీవేశ్వరులుగా తోచుచున్నది.







నాటకశాలయందు స్థితమైన దీపము నటులను, సభాసదులను కూడా ప్రకాశింపజేయును. ప్రకాశమే అది. ఏమియూ లేని సమయమున శూన్యమును ప్రకాశింపజేయును. ఇదేవిధముగా స్థూలశరీరమనే నాటకశాలకు సాక్షి రూపము జ్ఞాత. చిదాభాసుడు రాజు. మనస్సు ప్రధానుడు. పంచ ప్రాణములు అనుచరులు. సర్వేంద్రియములు తాలధారులు. పంచ విషయములు సభాసదులు. బుద్ధి నటి. వీరందరూ జాగ్రత్ స్వప్నావస్థలలో ఉన్నారు. వీనిని జ్ఞాత ప్రకాశింప చేయును. కనుక అది సాక్షి. ఐదు కోశములలో అనుస్యూతముగా నుండు ఈ సాక్షిని హిరణ్మయకోశము అంటాము. ప్రత్యగాత్మ ప్రకాశము వలన ఈ కోశము సుఖ దుఃఖములకు లొంగియుండక, సాక్షిగా నుండి ఆనందం కలుగుటకు కారణమైనది. కనుక ఈ హిరణ్మయకోశము ఆనందమయకోశమునకు ఆధారము. తురీయావస్థలో దీనిని తెలియనగును. ఈ హిరణ్మయ కోశమే పరమాత్మ సమిష్టి.

జాగ్రత్ స్వప్న సుషుప్త్యావస్థలన్నింటిలోను ఈ జ్ఞాత ఉన్నది. జాగ్రదవస్థలో ఇంద్రియాంతఃకరణముల సహాయముతో భౌతిక సర్వస్వాన్ని ఈ జ్ఞాత ప్రకాశింప చేయుచున్నది. స్వప్నావస్థలో కేవలము అంతఃకరణ సహాయము చేత స్వప్నములను ప్రకాశింప చేయుచున్నది. సుషుప్తిలో దేని సహాయమును అపేక్షింపకయే జ్ఞాత తనకు తానుగా ప్రకాశించుచుండును.

సుషుప్తిలో బుద్ధి అజ్ఞానాకారము పొంది సమిష్టి అవిద్యలో కలిసి జ్ఞాతకు విషయమగుచున్నది. జ్ఞాత పరాప్రకృతికి చెందినది. జ్ఞేయము మలిన సత్వ సహితమగు అపరాప్రకృతికి చెందినది. సుషుప్తిలో సాక్షి అగు జ్ఞాత అజ్ఞానమును ఎరుగుచున్నది. ఈ అజ్ఞానము సుషుప్తిలో పొందెడి ఆనందమును మనకు తెలియకుండ చేయుచున్నది. ఈ అజ్ఞానము మనము కాదు.

వీటినన్నిటిని కాదని ప్రత్యేకముగా నిలుచు "ఎఱుక"యే మన స్వరూపము.

## ప్రశ్న 3. ఎఱుక స్వరూపము ఏమి?

**భగవాన్ :** ఎఱుక స్వరూపము సచ్చిదానందము.

**వివరణ :** మనస్సు పాంచభౌతికము. పాంచభౌతిక పదార్థములను అది సాపేక్షముగా తెలుసుకొనగలదు, జ్ఞాత దానికి గ్రహింపు శక్తిని ఇచ్చును.

ఎఱుక పాంచభౌతిక పదార్థము కాదు కనుక మనస్సు దానిని సాపేక్షముగా చూడ జాలదు. భౌతికమునకు అతీతమైనది ఈ ఎఱుక. దీని లక్షణాలు ఇవి అని ఖచ్చితముగా చెప్పజాలము.

ఎఱుక హృద్గోచరం. మనోగోచరం కాదు. ఇది స్వయంప్రకాశము. సూర్యుని తెలుసుకొనడానికి దీపము అక్కర్లేనట్లు ఎఱుక స్వయంజ్యోతి స్వరూపము గనుక ఏ ఉపాధి సహాయము లేకుండా తెలుసుకొనగలము.

అచలంగా, స్వయం ప్రకాశంగా, నిశ్చలంగా ఉన్న ఈ ఎఱుకను చైతన్యం అంటారు. సచలంగా ఉన్న ఎఱుకను శక్తి అంటారు. అందుచేత ఉన్నది అంతా ఈ ఎఱుకయే. అచలమైన ఎఱుకను సముద్రం అనుకుంటే దానిపై కెరటాలు సచలమైన ఎఱుక.

అనాత్మ సంఘాతంలో లేక మాయలో ఎఱుక ప్రవేశించినప్పుడు సత్వ రజస్తమోగుణములు చైతన్యవంతమగును. ఈ త్రిగుణముల సాయమున మాయ ఈ సకలమును సృష్టించును. చైతన్యవంతమైన మాయ ఎఱుక యొక్క శక్తి. ఉన్నది ఎఱుక ఒక్కటే.

ప్రస్తుతం మనం మాయాధీనులమై అచలముగా ఉన్న ఎఱుక గురించిన జ్ఞానమును పోగొట్టుకున్నాము. సముద్రపు ఒడ్డున గల కెరటములను దాటి లోనికి వెళ్ళినప్పుడు మాత్రమే నిశ్చలమై, అనంతమై, ఏకమై ఉన్న నిర్మల సాగరం మనకు గోచరమవుతుంది.

ఇదేవిధంగా మనస్సు విషయాకర్షణ వల్ల ఎప్పుడూ చలిస్తూనే ఉంటుంది. చలనము దాని సహజ ధర్మము. ఆత్మజ్ఞానం కలిగినప్పుడు మాత్రం మనస్సు నిశ్చేష్టమై అంతరంగమందున్న అనంత శాంతి సాగరంలో లయమైపోతుంది.

ఈ నిశ్చల శాంతిని కొద్ది క్షణాలు మాత్రం మనస్సు అనుభూతి పొందినప్పటికి, అది ఎఱుక అని, అనంతమని, నిశ్చలమని, తాను కాక రెండవది లేనిదని స్వప్రకాశమని ఆనంద స్వరూపమని, మహాశక్తివంతమైనదని, మనస్సు







మెలకువగా ఉంటాడు. మెలకువలో ఉండి కూడా నిద్రిస్తాడు. పని చేయాల్సిన సహజావస్థలో పని చేస్తాడు. కాదు - పని జరిగిపోతుంది.

సాధన చేయుచున్నప్పుడు, ఏమైనా సందేహాలు వస్తే అవి మనస్సులో పుడుతున్నాయని తెలిసికొనాలి. అప్పుడు మనస్సు యొక్క మూలాన్ని వెదకితే ఆత్మ జ్ఞానము కల్గుతుంది. ఆత్మ చైతన్యము పూర్ణము కనుక అది ఒక్కటే ప్రకాశించి ఇతరములైన సర్వస్వాన్ని నాశనము చేస్తుంది. కనుక ఆత్మను తెలిసికొనటానికి మనము ఆత్మ కావాలి.

కుక్క వాసన చూచి యజమానిని పసిగట్టినట్లు అహంవృత్తిని ఆశ్రయించి ఆత్మను పట్టుకొనాలి. అహంవృత్తిని ఆశ్రయించడమంటే దాని నుండి పుట్టు ఇతర వృత్తులను విసర్జించి స్వతంత్రముగా నిలవగల ఒక్కటిగా ఉండి పోయిన అహంవృత్తిని ఆశ్రయించాలి. ఆవిధముగా అహంవృత్తిని ఆశ్రయించి దాని మూలాన్వేషణ చేసి ఆత్మను పట్టుకోవచ్చు. తాను "నిజమైన నేను"గా తెలిసికొనే వరకు విచారణ అవసరము.

## ప్రశ్న 16. స్వరూప స్వభావమేమి?

**భగవాన్ :** యథార్థముగ నుండునది ఆత్మస్వరూపమొకటే. జగజ్జీవేశ్వరులు ముత్తెపుచిప్పయందు వెండివలె అందు కల్పనామాత్రులే. ఈ మూడునొకమారే తోచి ఒకమారే అదృశ్యమగును. 'నే'నను తలంపు కించిత్తును లేని తానే స్వరూపము. అదియే మౌన మనబడును. స్వరూపమే జగము; స్వరూపమే నేను; స్వరూపమే ఈశ్వరుడు. సకలము శివస్వరూపమే.

**వివరణ :** స్వరూపము హృద్గోచరము మాత్రమే. ఇంద్రియ గోచరము కాదు. అందుచేత పంచేంద్రియములు, అంతఃకరణము ఇచ్చు జ్ఞానముతో దీనిని కనుగొనలేము. అంతఃకరణము, ఇంద్రియములు పాంచభౌతిక జ్ఞానమును తెలిసికొనుటకు మాత్రమే ఉపకరించును.

తానని వ్యవహరించు ఈ బ్రహ్మము యొక్క స్వరూపమునకు శబ్ద స్పర్శాది గుణములు లేవు. పుట్టుట, ఉండుట, పెరుగుట, తరుగుట, మార్పు చెందుట,

తోసివేసి "నిజమైన నేను" అచట నిలుస్తుంది.

ఆత్మ లేకుండా ఏ పనైనా జరుగుతుందా? ఆత్మ సన్నిధి లేకుండా మనస్సు కర్మ చేయగలదా? అందుచేత మనస్సు కర్త ఎట్లు అవుతుంది? ఆత్మ స్థితిలో నున్నపుడు కర్త, కర్మ, క్రియలు ఉండవు.

నీ శరీరము, ఇతరుల శరీరములు అను భావాలు ఆత్మకు భిన్నముగా ఎందుకు ఉంటాయి? ఆత్మ సర్వవ్యాపి కదా? కనుక నువ్వు పాల్గొన్నా, పాల్గొనక పోయినా పని దాని అంతట అది సక్రమముగా జరుగుతుంది.

ప్రపంచములో "దుఃఖము ఎందుకు ఉన్నది?" అని విచారణ చేస్తే "సుఖము పొందాలనే కోరిక ఉదయించుటకు" అనే సమాధానము వస్తుంది. తరువాత సుఖము పొందాలనే కోరిక శాశ్వత సుఖానికి దారి తీసి స్వస్వరూప సుఖస్థితి అబ్బుతుంది.

నేను అనే తలంపు, తలంపుగా ఉన్నంత కాలము పుడుతూ అణుగుతూ ఉంటుంది. ఆలోచనా రహిత స్థితి సిద్ధించిన నాడు నిజమైన నేను మిగిలి నిశ్చలముగా ప్రకాశిస్తూ ఉంటుంది. అనుగ్రహ ప్రేరణ నీ ప్రయత్నానికి దోహదకారి.

నీ ఆత్మను నీవు తెలుసుకొనాలని బుద్ధి కల్గడమే ఈశ్వరానుగ్రహానికి గుర్తు. హృదయములోని ఆత్మ, లోనికి రమ్మని నిన్ను గుంజుతోంది. నీవు లోనికి ప్రవేశించటానికి ప్రయత్నించాలి. గురు స్వరూపములోనున్న ఈశ్వరానుగ్రహము ఇందుకు తోడ్పడుతుంది.

ఈశ్వరునకు "మిథ్యా నేను"ను అర్పిస్తే సర్వము అర్పించినట్లే. ఇదే భక్తి, ప్రపత్తి. ఇట్టి సంపూర్ణ శరణాగతి కేవలము భగవంతుని అనుగ్రహము వలననే సాధ్యము. ఈ అనుగ్రహం సోమరులకు రాదు. సాధనల ద్వారా అహాన్ని అణచటానికి యత్నిస్తున్న వారినే వరిస్తుంది. నిద్ర మన స్వరూపాన్ని కప్పివేస్తున్నట్లే మెలకువ కూడా మన నిజ స్థితిని కప్పి వేస్తున్నది. కనుక ఈ రెండు అవస్థలలోనూ మన స్వరూపము మనకు తెలియుట లేదు. కనుక విచారణ చేసి మనస్సు యొక్క మూలాన్ని వెదకి పట్టుకుంటే నిద్రయు, మెలకువయు కాని ఒకానొక "జాగరిత స్థితి" సిద్ధిస్తుంది. అదే తురీయావస్థ. అట్టి అవస్థలో నిద్రిస్తూ కూడా







తెలుసుకుంటుంది. నిరంతర విచారణ ద్వారా ఆ జ్ఞానాన్ని మనస్సులో నిశ్చయంగా స్థిరపరచుకొనాలి.

"అహం బ్రహ్మాస్మి" అంటే "నేను ఎఱుకను" అనే అనుభవ జ్ఞానం.

"మిథ్యా నేను"తో "అహం బ్రహ్మాస్మి" అను మహా వాక్యాన్ని ఎన్నిసార్లు జపించినప్పటికీ బ్రహ్మజ్ఞానం కలగదు. "మిథ్యా నేను" నాశనం అవదు. విచారణ ద్వారా ఆత్మకాని దాని నుండి తాదాత్మ్యాన్ని వదులుకొనగా వదులుకొనగా, ఆత్మ మిగులుతుంది. ఆత్మజ్ఞానం కలుగుతుంది. అంతేకాని మేథోపరంగా నేను శరీరం కాదు. మనస్సు కాదు. బుద్ధి కాదు. ప్రాణం కాదు. అజ్ఞానము లేదు అనుకుంటూ ఉన్నంత మాత్రాన వాటితో తాదాత్మ్యం పోదు. మేథోపరంగా నేను అది కాదు, ఇది కాదు అనేది "మిథ్యా నేను". మిథ్యా నేను ఉన్నంతకాలం అనాత్మతో తాదాత్మ్యం తప్పనిసరి.

ఎఱుకలో మనస్సు నిశ్చలముగా ఉన్న వారికి సచల చైతన్యము కూడా బ్రహ్మముగానే స్ఫురిస్తుంది. భేద బుద్ధిలో ఉన్నవారికి మాత్రము అది జగత్తుగా గోచరిస్తుంది.

మనస్సులోని చైతన్యాంశము సాక్షిగా ఉండి జడ ప్రపంచాన్ని జడముగా చూచుచున్నది. మనస్సు ఉన్నంతవరకు జగత్తు వేరుగా కనిపిస్తుంది. మనస్సు చైతన్యములో లయమైపోతే అంతాబ్రహ్మమయమే. అప్పుడు అంతా సచ్చిదానందమే.

## ప్రశ్న 4. స్వరూప దర్శన ప్రాప్తి ఎప్పుడగును?

**భగవాన్ :** దృశ్యముగానున్న జగత్తు కనబడకపోయినప్పుడు ఆ దృక్కు యొక్క అనగా స్వరూపము యొక్క దర్శనమగును.

**వివరణ :** ఆత్మ బిందువు మాయా ప్రభావం వలన తన స్వరూపాన్ని మర్చిపోతే దానిని అవిద్య అంటాము. జాగ్రదవస్థ స్థూలమైన అవిద్య. ఆవరణ దోషము అవిద్యకు మూలము. చిదాభాసుడు అవిద్యచే ఆవరింపబడినప్పుడు మనకు ఆత్మస్వరూపజ్ఞానం ఉండదు. ఆవరణ దోషం వలన ఉన్న వస్తువు కప్పబడి వేఱొక వస్తువుగా స్ఫురించును. జాగ్రదవస్థలో చిదాభాసుడు మనస్సుతో చేరియుంటాడు.

అప్పుడు విక్షేపదోషం వలన ఏకవస్తువు నానాకారములు (multiplicity) పొందినట్లు భ్రాంతి కలుగును. రజోగుణం చైతన్య వంతమయి "మిథ్యా నేను" అనే అహంభావం ఏర్పడును. తమోగుణం చిదాభాసుని సన్నిధి వలన చైతన్యవంతమయినప్పుడు జగత్తు వేరుగా గోచరించును. ఇట్టి భేదభావముతో "మిథ్యా నేను" జగత్తును చూచును. జాగ్రదవస్థలోని ఈ జ్ఞానము సాపేక్ష జ్ఞానము (relative knowledge) మాత్రమే.

ఎఱుక శాశ్వతమైన ఆనందముతో స్వయంస్పృహతో ఉంటుంది. ఇది సామాన్య చైతన్య లక్షణము. జాగ్రదవస్థలోని విశిష్టచైతన్యము అట్టిది కాదు. ఇది శుద్ధ చైతన్య కాంతి సంస్కారములతో కూడిన మనస్సు మీద ప్రతిఫలించినందువల్ల ఏర్పడిన సంకుచిత చైతన్యము. ఈ సంకుచితత్వం వలననే మనస్సుకు సంకల్ప వికల్పాలు కలిగాయి. చంచలత్వం అబ్బింది. తలంపులు మనస్సులో బయలుదేరి స్వరూపజ్ఞానాన్ని ఆవరించి వేసాయి. అందువలన మనస్సుకు అవస్థా భేదములు అంకురించాయి.

ఒక అవస్థకు మరొక అవస్థకు మధ్య, ఒక తలంపుకు మరొక తలంపుకు మధ్య ఎప్పుడైనా ఎడము లేక శూన్యము ఏర్పడితే దానికి ఆధారముగా ఉన్న ఆత్మ చైతన్యం అప్పుడు మనకు ఎరుకపడుతుంది. నిద్ర తరువాత దేహతాదాత్మ్యం ఇంకనూ పొందని బీజ జాగ్రత్తులో (unmanifested waking state) "శుద్ధమైన నేను" బయటపడుతుంది. స్వరూప దర్శన ప్రాప్తికి ఇది దోహదకారి.

మిథ్యా నేనుతో జగత్తును చూచినంత కాలము అది మనకు విడిగా, కేవలం పాంచభౌతిక పదార్థముగా మాత్రమే గోచరిస్తుంది. విచారణ వల్ల ఈ అబద్ధపు నేను అణిగిపోతుంది. రజస్తమోగుణాలు సత్వగుణములో లయిస్తాయి. శుద్ధచైతన్యం అట్టి మనస్సులో ప్రతిబింబిస్తుంది. కేవల సత్త్వగుణంలో ఉన్న మనస్సుకు స్వరూపజ్ఞానం కలిగి నిశ్చలం అవుతుంది. అందుచేత సత్త్వగుణాన్ని పట్టుకొని దేహాత్మబుద్ధి అనే మిథ్యా తాదాత్మ్య భ్రాంతిని వదలించుకోవాలి.

జాగ్రదవస్థలో బంధచింత, ముక్తిచింత రెండూ ఉంటాయి. ముక్తి చింత ఎవరికి అని విచారణ చేసినప్పుడు ముక్తి కోరేవాడు అదృశ్యమవుతాడు.







చిత్స్వరూపమును స్మరించుచూ దృశ్య దర్శనాది రోగ రహితమగు ఆత్మను ఎఱుగుచున్నాడు.

హృదయమున విచారణ అను కల్పవృక్షము యొక్క ఒక్క చిన్న అంకురము స్ఫురించగానే అభ్యాస యోగముచే అది బహుశాఖాయుక్తముగా పెరిగి విలసిల్లుతుంది.

విచారణ దృఢపడినట్టి వైరాగ్యయుక్తుడగు మనుజుని, శమదమాది శుద్ధ గుణములు తమంతతాము వచ్చి ఆశ్రయించును.

జల ప్రవాహములు పర్వతమును కదలింపజాలనట్లు, విచారణాయుక్తుని శోకమోహాది వికల్ప సమూహములు ఏవియునూ చలింపజాలవు.

గాఢనిద్రలోని "నేను" ఆలోచించే మనస్సుతో కలియటం లేదు. కలలుగనే నిద్రావస్థలోనూ, జాగ్రదవస్థలోనూ ఈ నేను మనస్సుతో కలిసి చిత్తవృత్తులను మేల్కొలుపుతోంది. కనుక జాగ్రదవస్థలో ఆలోచించే మనస్సుతో కలియకుండా వేరుగా ఉండడమే విచారణ.

గాఢనిద్ర నుండి మెలకు రాగానే "అహం" పుడుతోంది. అట్టిది పుట్టిన తక్షణము, అనగా మెలకువ వచ్చిన తక్షణము అనగా ఉదయ సంధ్యలో ఈ అహంభావ పదార్థము గురించి విచారిస్తే ఈ అహంభావ పదార్థము అప్పటికప్పడే తిరిగి ఆత్మలో లయమైపోతుంది.

ఈ అహంభావ పదార్థమే మనకు దేహానుసంధానం కల్గించి ఒక కృత్రిమ పరిమితి కల్గిస్తోంది. మెలకువలో ఈ అహంభావ పదార్థము వచ్చిన తర్వాతనే మనలో సంకల్పాలు జనిస్తున్నాయి. అందుచేత "ఈ అహంభావ పదార్థమెవరు?" అని శోధించినపుడు సంకల్పాలు నశిస్తాయి.

విచారణను ముందు మనస్సుతోనే ప్రారంభించాలి. మనస్సును అంతర్ముఖపరిచి ఉధృతముగా దూసుకువస్తున్న తలంపులను నిరోధించిననాడు వాని వెనుకగల హృదయ స్థానాన్ని గుర్తించగలము. మనస్సు హృదయములో మునగగానే నిశ్చలానందము ముంచెత్తుతుంది. కనుక విచారణకు ప్రశాంతమైన మనస్సు అవసరము. అట్టి ప్రశాంత మనస్సే బ్రహ్మము. "మిథ్యానేను" అను భావాన్ని

## ప్రశ్న 15. విచారమెంతవరకు ఆవశ్యకము?

**భగవాన్ :** మనస్సునందెంతవరకు విషయవాసనలు వసించియుండునో అంతవరకు 'నేను ఎవడ'నను విచారణ ఆవశ్యకము. తలంపుదయించగా ఉదయించగా వాని నప్పడప్పడే అవి పుట్టుతావుననే విచారణచే నశింపజేయ వలెను. ఒకడు స్వరూప ప్రాప్తిని పొందువరకు నిరంతర స్వరూపస్మరణము చేపట్టి యుండవలెను. అది యొక్కటియే చాలును. కోటలో శత్రువులున్నంత వరకు వారు వెలికివచ్చుచునే యుందురు. వారు తలచూపగా తలచూపగా అపుడపుడే వారిని చంపినచో కోట కైవశమగును.

**వివరణ :** పనులను ఆచితూచి చేసినపుడు పనియందు శ్రద్ధ కల్గి ఆ పనిని సక్రమముగా చేయగలము. పనివల్ల ఘర్షణ ఉండదు. అట్లుండి అతి పాటవముతో ఆ పనిని చేసిన నాడు ఒక తృప్తి మిగులును. తామరాకుపై నీటి బొట్టువలె జీవించుట అలవరచుకొనినపుడు పని బాగుగా చేసినామను గర్వముతో కూడిన కర్తృత్వము కూడా ఉండదు. అప్పడు ఆ పనికి సంబంధించిన వృత్తులు మనస్సున మొలకెత్తవు. విచారణ ద్వారా ఇతర వృత్తులను నాశనము చేయుచూ పోగా మనోనాశము సిద్ధించి స్వరూప ప్రాప్తిని పొందనగును.

స్వరూప ప్రాప్తి అంటే ఆత్మతో అనుసంధానమన్నమాట. అది సిద్ధించి నప్పడు చిత్త త్యాగము అతి సులభము. అహంకారాది జగద్రూపమగు దృశ్యము వాస్తవముగా లేనే లేదు. కాబట్టి "ఈ అహంకార పదార్థమేమి" అను విచారణచే అహంకారాది జగద్రూపము మాయమై చిదాకాశమే శేషించుచున్నది. భూతాకాశ, చిత్తాకాశములు రెండునూ చిదాకాశ బలము వలననే ఉద్భవించినది.

చిదాకాశము బాహ్య పదార్థములందునూ, మనో బుద్ధ్యాదులందునూ కూడా స్థితి కల్గియుండి వాని సత్త, అసత్తలను (రాకపోకలను) ఎఱుంగుచూ సాక్షియై యున్నదియు, సమస్తమునందునూ వ్యాపించి యున్నదియునై ఉన్నది.

కల్లు తాగిన వాడు మత్తు వదలిన పిదప తన పూర్వపు స్థితని స్మరించునట్లు, అనాత్మ సంఘాతము నుండి తాదాత్మ్యము విడచినవాడు యదార్థ







అహంభావం కనుమరుగౌతుంది. ముక్తి మిగులుతుంది.

ఆత్మ విద్యకు చూచేవాడు, చూచుట, చూడబడేది అనే త్రిపుటి అవసరం లేదు. ఆత్మ స్వయంజ్యోతి కనుక దానిని తెలుసుకొనుటకు వేరొకదాని అవసరం లేదు. స్వయంజ్యోతి అయిన సూర్యుని చూచుటకు దీపం అవసరమా!

అహంభావం అనే కదలికకు కారణమైన కాంతిమీద దృష్టి పెట్టవలెను. అంటే మానసిక అవస్థల నుండి వీటి క్రియల నుండి దృష్టి మళ్ళించి వాటికి కాంతినిచ్చే చైతన్యం మీద దృష్టి పెట్టినప్పడు చైతన్యపు కాంతి దానికదే వ్యక్తమగును. విచారణ ఇట్టి శుద్ధచైతన్య సాక్షాత్కారానికి దోహదపడుతుంది. అప్పడు జాగ్రదవస్థలోనే అహంస్ఫురణ ఎరుకబడి మిగతా అవస్థలలో కూడా తెంపు లేకుండా ఉండి విస్పష్టమైన స్వరూపజ్ఞానం కలుగుతుంది.

ఈశ్వర ప్రేరణవల్ల విచారణ చేసినప్పడు ఎఱుకతో మనస్సు ఆత్మతో సంయోగం జరిగి మనస్సు అతీతశక్తికి వశం అవుతుంది.

మూడు మానసిక అవస్థలు దేనిలో గోచరించి దేనిలో లయము అవుతాయో అదే మన స్వరూపము. ప్రాణము, వాక్కు, మనస్సులను నిరోధించి చేయు అన్వేషణను జ్ఞాన విచారణ అంటాము. లోన మునుగు మనస్సు చేయు విచారణ వల్ల "నిజమైన నేను" స్వయంజ్యోతిగా గోచరించును. ఇది జాగ్రదవస్థ లోనే సాధ్యము. గురు సన్నిధిలో సాధన సులభముగా సహజముగా జరుగును.

అజ్ఞానావరణమే సృష్టి. ఒకే జగత్తు ఒకే సమయములో అజ్ఞానులకు ఉన్నట్లుగాను జ్ఞానులకు లేనట్లుగాను తోచుచున్నది. బ్రహ్మనిశ్చయాత్మక బుద్ధి కలిగిన జ్ఞానికి జగత్తు కూడా బ్రహ్మముగానే తోచును.

దృక్కు దృశ్యాన్ని చూచుచున్నది. ఎఱుకయే దృక్కు. జగత్తు దృశ్యము. స్వరూప దర్శనప్రాప్తి అనంతరము దృశ్యమగు జగత్తు వేరుగా కనబడదు. అప్పడు ఎఱుకయే స్వరూపముగా దర్శనమగును.

## ప్రశ్న 5. జగత్తున్నప్పడు (చూడబడినప్పడు) స్వరూపదర్శనం కాదా?

**భగవాన్ :** కాదు.

**వివరణ :** మసక చీకటిలో తాడు పాముగా కనబడుతుంది. వెలుగులో పాము అనే భ్రాంతి పోయి తాడు తాడుగానే గోచరిస్తుంది. తాడు పాముగా కనపడినంత కాలము తాడు కనబడదు. భ్రాంతి వలన తాడే పాముగా గోచరిస్తుంది. అదేవిధంగా బ్రహ్మము జగత్తుగా గోచరించినప్పుడు స్వరూపదర్శనం కాదు. ఎఱుక యొక్క స్వయంజ్యోతి కాంతి గోచరించినప్పుడు జగత్తు కూడా ఆత్మ స్వరూపముగా లేక బ్రహ్మముగా గోచరిస్తుంది.

జాగ్రదవస్థలో జగత్తు నామరూపాలతో గోచరిస్తుంది. స్వప్నావస్థలో ఊహా జగత్తు గోచరిస్తుంది. పూర్తి అజ్ఞాన స్థితి అయిన సుషుప్తిలో ఏ వస్తువూ గోచరించదు. ఆ కటిక చీకటి దశలో బ్రహ్మము గోచరించదు. జగత్తు గోచరించదు. ఏమియూ గోచరించని శూన్య స్థితిలోని ఆనందాన్ని అనుభవిస్తూ, అనుభవిస్తున్నాననే గ్రహింపుశక్తిని కూడ కోల్పోయి అజ్ఞానములో ఉండిపోతుంది. సమాధ్యవస్థలోమాత్రం ఎఱుక ఆత్మానందముతో భాసిస్తుంది. జగత్తు గోచరించదు.

శుద్ధచైతన్యపు కాంతి వాసనలతో కూడిన అంతఃకరణము మీద ప్రతి ఫలించినప్పుడు ఒక విశేష చైతన్యం ఏర్పడుతుంది. ఆ విశేష చైతన్యము పాంచ భౌతిక అంతఃకరణము ద్వారా ప్రసరించి జగత్తును పాంచభౌతిక వస్తువుగా మాత్రమే గ్రహిస్తుంది. సామాన్య కాంతి స్ఫటికము ద్వారా ప్రసరించినప్పుడు అది ఏడు రంగులుగా గోచరిస్తుంది. ఆ ఏడు రంగులతో సామాన్యకాంతికి సంబంధము లేదు. అట్లే శుద్ధచైతన్య కాంతి మనస్సనే అద్దంమీద పడినప్పుడు మనస్సులో ఉన్న సత్వగుణం దేవుడుగను. రజోగుణం జీవుడుగను, తమోగుణం జగత్తుగను గోచరించును. మనస్సు కలిగించే భ్రాంతులవల్ల ఇది కలుగును. అందుచేత ఇది విశేష చైతన్యము. శుద్ధ చైతన్యానికి ఈ భ్రాంతులతో సంబంధము లేదు.

ఇక్కడ ఒక ముఖ్య విషయము గమనించాలి. జగత్తు సచల చిద్వస్తువు అయినప్పటికీ, జడ మనస్సు ద్వారా చూసినప్పుడు జడవస్తువుగానే తోస్తుంది. సచల చిద్వస్తువుగా గోచరించదు. ఒకే జగత్తు మనస్సుతో చూచినప్పుడు జడముగాను, సమాధిలో ఉన్న బ్రహ్మవేత్తలకు బ్రహ్మముగాను తోస్తున్నది. అందుచేత







వాసన. దాని నుండి మిగిలిన వాసనలు బయలుదేరును. నిరంతర స్వరూప ధ్యానము నిలవనపుడు, ఆత్మ జ్ఞానము కలిగిన తరువాత కూడా నేను కర్తను, భోక్తను అను వాసనాంకురము ఉండును. అది తిరిగి విజృంభించి బలవత్తరమై జన్మ పరంపరకు కారణము కావచ్చును. కనుక ఆత్మ జ్ఞానము కల్గిన తరువాత కూడా అది స్థిరపడిన తరువాత కూడా నిరంతర స్వరూప ధ్యానము అవసరము.

నేను కర్తను అనునది విపరీత భావన. అజ్ఞాన జనితము. ఆత్మానుభూతికి ప్రతిబంధకారి.

కర్మానుష్ఠానముచే స్థూల శరీరాభిమానము పోవును. ఉపాసనచే సూక్ష్మ శరీరాభిమానము తొలగి మనోబుద్ధ్యాదులు తోచకుండా పోవును. స్వరూప జ్ఞానముచే కారణ శరీరాభిమానము కూడా తొలగును. ఈ ప్రకారము త్రిశరీర శుద్ధి తెలియవలయును.

పంచకోశముల తాలూకు వృత్తులే జ్ఞాన ప్రతిబంధకములు. పంచకోశ నాశనమంటే వాటిమీద అభిమానము వదలుట. ఈ వదలు ప్రక్రియకు జీవితములో మూడు విషయములను ఆచరించవలెను.

1. ప్రతి వ్యవహారము ఎఱుకతో ఆచితూచి నిర్వహించవలెను.
2. ఏ పనినైననూ అతి శ్రద్ధగా (sincere) పాటవముతో (skillfully) మనస్సును కేంద్రీకరించి (concentrated attention) చేయవలెను.
3. జీవితమును తామరాకుపై నీటి బొట్టువలె నడుపుకొనవలెను. (living a life without attraction to nonself)

ఆధ్యాత్మిక వికాసమునకు ఆహార నియమము అవసరము. సాత్వికమైన ఆహారము మితముగా తీసుకొంటే జ్ఞానమునకు అయినా, ఆత్మ విచారణకైనా అనుకూలంగా ఉంటుంది. సాత్వికాహారము సాత్విక గుణాలను పెంచుతుంది. ఇట్లు చేసిన యెడల సకల విషయ వాసనలు వీగిపోయి స్వస్వరూపములో ఉండుట సాధ్యమగును.

## ప్రశ్న 14. అనాది నుండి వచ్చుచున్న సకల విషయ వాసనలు వీగి స్వరూపమునందుండుట సాధ్యమా?

**భగవాన్ :** ‘సాధ్యము కాదా, సాధ్యమా’ అను సందేహపు తలంపునకు అవకాశ మీయక దృఢముగా స్వరూపధ్యానము పట్టువిడువక ఉండవలెను. ఒకడెంత పాపి అయ్యును, “నేను పాపినే? ఎట్లు కడతేరగలను?” అని పొక్కుచుపొక్కుచు నుండక ‘నేను పాపిని’ అను తలంపును పూర్తిగ నాశనము చేసి స్వరూపధ్యానము నందు దృఢమైన పట్టుదలతో ఉన్నట్లైన వాడు నిశ్చయముగ కడతేరును. మంచి మనస్సని, చెడ్డ మనస్సని రెండు మనస్సులు లేవు. మనస్సొక్కటే. వాసనలే శుభములని, అశుభములని రెండు విధములు. మనస్సు శుభవాసనల వశమున ఉన్నప్పుడు మంచి మనస్సుగా ఉండును. అశుభవాసనల వశమగునపుడు చెడ్డ మనస్సనబడును.

ప్రపంచ వ్యవహారములలోనికి ఇతరుల వ్యవహారములలోనికి మనస్సును పోనీయరాదు. ఇతరులెంత దుర్మార్గులయినను వారి విషయమున ద్వేషము పెట్టుకోరాదు. రాగద్వేషములు రెండును వర్జ్యములే. ఒకడు ఇతరులకిచ్చునది సర్వము తనకే ఇచ్చుకొనుచున్నాడు. ఈ సత్యము తెలిసిన ఈయకుండు వాడెవడు? తన వ్యక్తి తోచిన సకలమును తోచును. తన వ్యక్తిత్వ మడంగిన సర్వము నడంగును. ఎంతెంత వినయముతో వర్తింతుమో అంతంత ఎక్కువ శుభము కలుగును. మనస్సు వశము చేసికొని యున్నచో ఎక్కడ నుండినను ఉండవచ్చును.

**వివరణ :** విషయ వాసనలకు ఆశ్రయము బుద్ధి. వాసనలకు, ఆత్మ స్వరూపమునకు సంబంధము లేదు. మన మనస్సు ఆత్మానుసంధానమైనచో వాసనలు పూర్తిగా క్షీణించును. “నేను పాపిని” అనుకొనునది అహంకారాది క్షేత్రము. ఆ తలంపుకు ఉత్పత్తి స్థానమైన బ్రహ్మానంద సాగరములో బుద్ధిని ఎల్లప్పడూ ఉదయించకుండా ముంచివేయవలెను.

నేను కర్తను, భోక్తను అను భావము బుద్ధిలో అనాదిగా జనిస్తున్న మొదటి







ప్రస్తుతం మనో దృష్టితో మాత్రమే మనం జగత్తును చూస్తున్నాము కనుక అది మనకు విడిగా ఉన్నట్లు, జడముగా ఉన్నట్లు తోస్తుంది. ఈ మనోకల్పిత జ్ఞానం పోతేకాని, జగత్తు చిత్ పదార్థమని గోచరించదు.

పైన చెప్పిన విశేష చైతన్యము మనస్సులోని భ్రాంతి ద్వారా ప్రసరించినంత కాలము ఉన్న వస్తువు ఉన్నట్లుగా తోచక వేరు విధముగా తోచును. ఈ విధముగా తోచుట పరిణామమందుము. అందుచేత ఈ భ్రాంతులు పరిణామమునకు కారణము. నీరు మేఘముగను, ఆవిరిగను, నదిగను రూపాంతరము చెందినను నీటి అణువులు ఎల్లప్పడు ఒకేలా ఉండునట్లు, బ్రహ్మ పదార్థము మాయా భ్రాంతుల వల్ల అనేకముగా తోచిననూ, అది ఏకముగానుండును (unitary consciousness). దానికి ఎట్టి వికారములు ఉండవు.

ఒకే వస్తువు తాను మార్పు చెందకుండా వేరు వస్తువుగా తోచుట పరిణామము. మాయ కలిగించే భ్రాంతుల వలన నామ రూపములు కలుగుటను సృష్టి అందురు. మాయా భ్రాంతుల వల్ల కల్గిన నామరూపములు కల్పనలే.

పూర్వము నుండియు ఉండిన మాయ తాను మార్పు చెందకుండా, నశించకుండా, నామ రూపములను పొందుట వలన జగత్తుగా ఏర్పడి వేరే వస్తువుగా తోచుచున్నది. ఈ మాయా కార్యము బ్రహ్మచైతన్య వ్యాప్తి వలన జరుగును. మాయతో కూడిన బ్రహ్మము వివర్తము చెందుట వలన జగత్తు ఏర్పడినది. సమాధిలో మాయచేత సృష్టించబడిన జగత్తు యొక్క నామ రూపములు పోయి కల్పనలు లేని శుద్ధమాయగా నగును. అపుడు మాయ బ్రహ్మముతో ఏకమై స్ఫురించును. సముద్రములో మంచు ముక్కలు సముద్రము కంటె వేరు కావు కదా! మాయ బ్రహ్మ సంబంధమైనది కనుక దాని కల్పనాశక్తి నిజము. కల్పితములు మిథ్య. సృష్టికి ఉపాదానము, నిమిత్త కారణము మాయతో కూడిన ఈశ్వరుడు. కనుక సృష్టి కూడా బ్రహ్మమేనని తెలియనగును.

## ప్రశ్న 6. ఏల?

**భగవాన్ :** దృక్కును దృశ్యమును, రజ్జు సర్పములవలెనున్నవి. కల్పిత సర్పజ్ఞానము పోయినగాని అధిష్ఠాన రజ్జుజ్ఞానము కలుగకుండునట్లు కల్పితమైన జగద్దృష్టి వీడిన

గాని అధిష్ఠాన స్వరూపదర్శనము కాదు.

**వివరణ :** మనస్సు, ప్రపంచముల ఉనికి బ్రహ్మమునందు ఆరోపిత భ్రాంతి జ్ఞానము వలననే జనితము. రజ్జుజ్ఞానము ఉన్నప్పుడు ఆరోపిత సర్పజ్ఞానము ఉండదు. మనస్సు, ప్రపంచము అజ్ఞాన కల్పితములు, కనుక ఆత్మజ్ఞానముతో అవి బాధింప బడును. బాధింపబడునది ఏదీ సత్యము కాదు.

ప్రపంచము అభావ రూపమైనది. అనగా లేనిది. రజ్జుజ్ఞానము వలన సర్పజ్ఞానము బాధింపబడును. అందుచేత సర్పజ్ఞానము నిజము కాదు. ఇది అభావ రూపము. అట్లే మనస్సు, ప్రపంచము అజ్ఞాన కల్పితములు. బ్రహ్మజ్ఞానముచే ఇవి బాధింపబడినప్పుడు ఇవి లేనివగును. అనగా అభావరూపములగును. బ్రహ్మముతో ఏకమైతోచును.

మనస్సు ఉన్న పదార్థమును లేనిదానిగను లేని పదార్థమును ఉన్నదానిగను తోపింపగలదు. కనుక అజ్ఞానముతో చూచినప్పడు ఈ మనస్సునకు ఈ కనులకు ముందు ఉన్నది జగత్తువలె గోచరించుచున్నది. జ్ఞాన దృష్టితో చూచినప్పడు మాత్రము జగత్తు బ్రహ్మముగనే తోచును.

తాడు, పాము అని రెండు లేవు. ఉన్నది ఒక్కటే. అదితాడు. అట్లే జగత్తు, బ్రహ్మము అని రెండు లేవు. ఉన్నది చిద్వస్తువు ఒక్కటే. అచలంగా ఉన్న చిద్వస్తువును బ్రహ్మము అని అంటారు. సచలంగా ఉన్న చిద్వస్తువును జగత్తు అంటారు. మసక చీకటిలో తాడును చూచి పాము అని భ్రమ పడినట్లు అంతః కరణోపాధిలో గల పరిమిత విశేష చైతన్యముతో, భేదబుద్ధితో బాహ్యమును చూచినప్పడు సచల చిద్వస్తువు జడమైన జగత్తుగా గోచరించును. ఈ సర్వ ప్రపంచము అజ్ఞానము వలన నానారూపములుగా ప్రతీతమగుచున్నదే కాని, జ్ఞానము కలిగిన పిదప బ్రహ్మ స్వరూపముగా మాత్రమే గోచరించును. నామ రూపములు స్ఫురింపవు. తాడులో కనబడిన పాముకే ఉత్పత్తి వినాశములు ఉండును. ఆధారము లేకుండ భ్రాంతి కలుగదు. ఆరోపిత సర్పము అసత్యము. ఆధారమైన రజ్జువు నిజము. పంచభూతాత్మక జగత్తు భ్రాంతి స్థితిలో మాత్రమే ఉన్నట్లు తోచును. అధిష్ఠాన బ్రహ్మమును ఎఱిగినప్పడు ఆరోపిత మనస్సు







కామక్రోధాదులనే అరిషడ్వర్గములు మనస్సు నుండి జనించి ప్రాణము ద్వారా క్రియ సల్పుచున్నవి. కనుక జ్ఞాన విచారము ద్వారా వాయు రూప మనస్సును జయించినచో కామక్రోధాదులను జయించగలము. విచారణ చేసినందువలన ఆత్మ స్వరూప పరిపాకము కలిగి మనస్సు యొక్క సంకల్ప వికల్ప ధర్మము నశించి, మనోనాశము కల్గి మనో జయము సిద్ధించును.

ప్రాణాయామ మార్గము ద్వారా కూడా మనోలయము కొంతవరకు సాధ్యమే. ప్రాణాయామ పరిపాకము సిద్ధించినపుడు ప్రాణవాయువు స్వాధీనమై వాయు సంబంధమగు మనస్సు అణగును. కాని ఈ అణగుట తాత్కాలికము మాత్రమే. తిరిగి తిరిగి విజృంభించుచుండును. ప్రాణాయామ పద్ధతి ద్వారా ఇంద్రియ జయము శాశ్వతముగా చేకూరదు. పరిశుద్ధ మనస్సు లేనివారికి బలవంతముగా మనస్సును లొంగదీసుకొను పద్ధతి ప్రాణాయామము. ఇందు మనస్సు లొంగినట్లే లొంగి తిరిగి విజృంభించుచుండును. పరిశుద్ధ మనస్సు కలవారు "విచారణ" అనే జ్ఞానమార్గము అవలంబించిన చాలు. మనస్సు బ్రహ్మ సంబంధీకమై శుద్ధ సత్త్వగుణ ప్రధానమగును.

ఇంకనూ జప తప ధ్యాన మార్గముల ద్వారానూ, ఆహార నియమములు ద్వారానూ మనస్సును నియమించు పద్ధతులు అనేకమున్నవి గాని అవి ఏవియు విచారణ మార్గమునకు సాటిరావు.

## ప్రశ్న 13. విషయ వాసనలు లెక్కకు మీఱి సముద్రములోని అలల వలె కానవచ్చుచున్నవి. అవి ఎప్పుడు వీగిపోవును?

**భగవాన్ :** స్వరూపధ్యానము విజృంభింపగా విజృంభింపగా తలంపులన్నియు నశించును.

**వివరణ :** సముద్రపు అలల మూలమును మనము వెదకినపుడు లోనగల నిశ్చల సాగర జలము గోచరించును. అట్లే అన్ని తలంపులకు మూలమైన "నేను" అనే తలంపు యొక్క మూలమును వెదకినపుడు సచ్చిదానంద బ్రహ్మ సాగర స్థితి గోచరించి తలపులన్నియు నశించును. ఇదే విచారణ.

ధ్యానము చేతను మంత్ర జపము చేతను మనస్సు ఏకాగ్రస్థితిని పొందుచున్నది. మనస్సెప్పుడును చలించుచునే యుండును. ఏనుగుతొండమెప్పుడును చలించుచుండును. దానిపై ఒక గొలుసు పెట్టినచో ఆ యేనుగు దానినే పట్టుకొని ఇంకొక దానిని తీసికొనక పోవుచుండును. అట్లే సదా చలించుచుండు మనస్సు ఏదో ఒక నామమునకో, రూపమునకో అలవరచినచో దానినే పట్టుకొని యుండును. మనస్సు లెక్కలేని తలంపులుగ విరియుటచే ఒక్కొక్క తలంపును అతిబలహీనమగుచున్నది. తలంపులు నాశము కానుకాను మనస్సేకాగ్ర స్థితిని పొంది దానిచే బలవంతము కాగా దాని ఆత్మవిచారము సులభముగ సిద్ధించును. నియమములన్నిటిలో ఉత్తమమైన సాత్విక మితాహార నియమముచేత మనస్సున సత్వగుణము పెంపొంది ఆత్మ విచారమునకు సాయపడును.

**వివరణ :** కృత్రిమ జపము చేయుటకు బదులు మనలో నిరంతరంగా, సహజముగా జరిగే “నేను”, “నేను” అనే జపాన్ని స్ఫృహలోకి తెచ్చుకోడానికి ప్రయత్నించాలి. “నేను”, “నేను” అనే ఒక్క తలంపును మనస్సులో, స్ఫృహలో నిలుపుకొంటే ఇతర తలంపులు మటుమాయమవుతాయి. ఇతర తలంపులు మటుమాయమవ్వైనకొలది, స్ఫృహలో నున్న ‘‘నేను’’ అను తలంపుకు బలమేర్పడుతుంది. నేనెవరు? అను ప్రశ్నకు సమాధానము ఎఱుకలోనికి (స్ఫృహలోనికి) వచ్చి మనస్సు నిలిచిపోయినప్పడు ఎఱుక స్థిరపడుతుంది. ఎఱుకయే తాను అను అనుభవము ఒక్కటే మిగిలి యుంటుంది. ఇది విచారణా స్థితి. ఇది సూటియైన తేలిక మార్గము, దగ్గర మార్గము. ఇతర ఉపాయములున్నవి గాని, అవి ఇంత ఫలవంతములు కావు.

ప్రాణమును నియమించి మనస్సును నిరోధించగల్గు విధానమొకటి ఉన్నది. తమోకాశములో నాల్గవ భాగము వాయుతన్మాత్రతో కలిసినపుడు మనస్సు అనే సూక్ష్మ గోళకం ఏర్పడుతుంది. వాయుతన్మాత్ర నుండి రజోగుణ ప్రభావము వలన స్థూల ప్రాణవాయువు చలించును. అందుచేత మనస్సు, ప్రాణము ఒక దానితో ఒకటి అనుబంధము కలవు. ఒకటి నిశ్చలమైనచో మరొకటి కూడా నిశ్చలమగును. ప్రాణము నియమించబడినపుడు మనస్సుకూడా నియమములోకి వచ్చును.







కానరాదు.

మనస్సు బ్రహ్మజ్ఞాన సమయములో లేదు అనగా సమాధి స్థితిలో లేదు. అజ్ఞాన సమయమున కూడా లేదు. అనగా సుషుప్త్యవస్థలో కూడా లేదు. జాగ్రత్ స్వప్నావస్థలలో మాత్రము మనస్సు ఉన్నట్లుతోచి విపరీత జ్ఞానమును కలిగిస్తుంది. జాగ్రదవస్థనే నిజము అని నిర్ణయించి విపరీత జ్ఞానముతో మనము ప్రవర్తించినంతకాలము బ్రహ్మజ్ఞానం మనకు కలుగదు.

అమనస్కస్థితి మన సహజస్థితి, మనస్సు ఉన్నట్లు తోచే అవస్థలు అసహజములు. మనస్సును ఆధ్యాత్మిక హృదయములో లీనం చెయ్యడమే విచారణ యొక్క సారము. తాను చేతనుడని తెలిసిన తర్వాత జడము కూడ చేతనము కంటె వేఱుకాదని తెలుస్తుంది. కనుక కల్పిత జగదృష్టి వీడిన తర్వాత మాత్రమే అధిష్ఠాన స్వరూప దర్శనం అవుతుంది.

## ప్రశ్న 7. దృశ్యమగుచున్న జగత్తు ఎప్పుడు అణగును?

**భగవాన్ :** సర్వ విషయజ్ఞానములకు, సర్వవ్యాపారములకు కారణమగుచున్న మనస్సణగినప్పడు జగమంతర్థానమగును.

**వివరణ :** మనస్సు అణగినప్పడు జగము అంతర్థానమగును. మనస్సునకు జగమునకు సంబంధము అట్టిది.

ఆలోచనయే మనస్సు స్వరూపము. నిజానికి ఆలోచనల సమూహమే మనస్సు. ఆలోచన చుట్టూ అంతఃకరణ క్రియ జరుగుతూ ఉంటుంది. ఏ ఆలోచనా లేనప్పడు మనస్సు క్రియా శూన్యము. మనస్సు అప్పడు లేనట్లే. అచ్చుతో కలిసినపుడే హల్లుకు ప్రాణం వస్తుంది. అట్లే ఆలోచనలు “నేను”తో కలిసినప్పడే వాటికి ప్రాణం వస్తుంది. ఆలోచనలు కలిగినప్పడు మనస్సు ఉన్నదని భ్రాంతి కలుగును. ఆలోచనలు పూర్తిగా ఉపశమించినపుడు ఆలోచనా రహిత స్థితిలో ఉన్న మనస్సు గోచరమగును. అది మృత మనస్సు (no mind state).

జగత్తు నందలి విషయములను ఇంద్రియముల సహాయముతో మనస్సు అనుభవించుచున్నది. ఈ అనుభవము మనస్సులో అహంభావమును

ప్రేరేపించును. అహంభావము వేరు, అహంవృత్తి వేరు. అహంవృత్తి అనగా నేను అనెడి స్పృహ. అది ఏ వస్తువుతో తాదాత్మ్యము చెంది ఉంటే ఆ వస్తువే నేను అనెడి భ్రాంతి కలిగిస్తుంది. అహంవృత్తి దేహ తాదాత్మ్యము చెందినప్పుడు శరీరము చేత చేయబడిన పనులన్నియు నేను చేయుచున్నాననెడి కర్తృత్వము కలిగించును. మనస్సుకు విషయాకర్షణ ఉన్నప్పుడు జగత్తు నందలి విషయములు మనస్సుకు కర్తృత్వము, భోక్తృత్వము కలిగించును. ఈ కర్తృత్వ, భోక్తృత్వములు మనస్సునకు ఉన్నంతవరకు దృశ్యమగుచున్న జగత్తు అణగదు. ఇది అంతయు మాయ యొక్క ప్రభావము. ఈ మాయ శుద్ధ సత్వమనస్సులో ఉన్నంతవరకు అపరోక్షానుభూతికి హానిలేదు. హృదయాకాశాన మధ్య భాగమున జ్ఞాన సూర్యుడు ఉదయించినప్పుడు అజ్ఞానమనే చీకటి తొలగిపోవును. అప్పుడు కలువలను పోలు ఇంద్రియములు వాటి వృత్తులను మాని ముకుళించును. మనస్సు అనెడి చంద్రుడు ఆనంద సముద్రమున మునిగి అస్తమించును.

మనస్సు బంధరూపము, మోక్ష రూపము కూడా. కారణ రూపమాశ్రయించి అవిద్య, అజ్ఞానము, మాయకు చెందిన కార్యములనాశ్రయించి సంకల్పము, సంసారము, సంస్కారములను సృష్టించుకొనుచున్నది. ఇవి బంధ కారకములు. వీనికి అతీతమైన మనస్సు తనయొక్క సహజస్థితిని పొంది ఆత్మ జ్ఞానమును పొందును.

విషయానందము అనుభవించెడి మనస్సు బ్రహ్మానంద సముద్ర వాసన ఇంచుక సోకిన చాలు. తక్షణము కరిగిపోయి నశించును. మనస్సు నశింపగనే దశేంద్రియములు విషయాకర్షణ చెందవు. సూర్యుడు అస్తమించిన తరువాత దాని కిరణములు కూడ అస్తమించినట్లు మనస్సుతోపాటు ఇంద్రియములు కూడ మాయమగును. జగము అణగును. బ్రహ్మము ప్రకాశించును.

## ప్రశ్న 8. మనస్సు స్వరూపమేమి?

**భగవాన్:** మనస్సాత్మస్వరూపమునందున్న యొక అతిశయ శక్తి. దాని నుండియే అన్ని తలపులు తోచుచున్నవి. అన్ని తలంపులను త్రోసివేసినపుడు మనస్సనునది వేఱుగా లేదు. కనుక తలంపే మనస్సు స్వరూపము. జగత్తునునదియు తలంపుల







జగత్తు మనకు విడిగాను, వ్యతిరిక్తముగాను ఉన్నారనే భ్రాంతి, నిత్య సంఘర్షణ మనస్సులో కల్గుచున్నది. అజ్ఞానము వలన సుఖము బాహ్యముగా నున్నదని తలచి, కోరికలు ఉదయించి విషయాకర్షణ కలిగి విషయములను వెంబడించి తుదకు దుఃఖమును కొనితెచ్చుకొనుచున్నాము. అందుచేత అజ్ఞానమే దుఃఖమునకు హేతువు. దుఃఖము నశించాలంటే అజ్ఞానము నశించాలి. అజ్ఞానము నశించాలంటే ఆత్మజ్ఞానము కలగాలి.

## ప్రశ్న 12. మనస్సు అణుగుటకు వేరు ఉపాయములు లేవా?

**భగవాన్ :** మనస్సణగుటకు విచారణ తప్ప సమర్థములయిన వేఱుపాయములు లేవు. ఇతరోపాయములచే మనస్సణగినను, అణగినట్లే యుండి అది మరల తలచూపును. ప్రాణాయామము చేత మనస్సణగినను ప్రాణమణగియుండ వఱకు మనస్సును అణగియుండి, ప్రాణము బయలువెడలినపుడు తానును బయలువెడలి వాసనల వశమై అనేక ముఖముల వ్యాపించును. మనస్సునకు ప్రాణమునకు పుట్టుచోటొక్కటే. తలంపే మనస్సు స్వరూపము. 'నే'నను తలంపే మనస్సు తొలితలంపు. అదే అహంకారము. అహంకారమెచట పుట్టుచున్నదో అచ్చట నుండియే శ్వాసమును బయలుదేరుచున్నది. కనుక మనస్సణగినపుడు ప్రాణమును, ప్రాణమణగునప్పుడు మనస్సును అణగును. కాని సుషుప్తియందు మనస్సణగినను ప్రాణమణగుట లేదు. దేహరక్షణ నిమిత్తము, దేహమనునది మరణించినదేమోయని ఇతరులకు సందేహము కలుగకుండుటకు, ఈ విధముగ ఈశ్వరనియతిచే ఏర్పడియున్నది.

జాగృతియందును సమాధియందును మనస్సణగినపుడు ప్రాణమును అణగుచున్నది. ప్రాణము మనస్సు యొక్క స్థూలరూపమనబడును. మరణ కాలము వరకు శరీరమున మనస్సు ప్రాణమునుంచుచు నుండి దేహము మరణించు సమయమున ప్రాణమునాక్రమించి తీసికొని పోవుచున్నది. కాబట్టి ప్రాణాయామము మనస్సును లొంగజేసికొనుటకు తోడ్పడునేగాని దానిని నశింపజేయదు. ప్రాణాయామమువలెనే మూర్తిధ్యాన, మంత్రజప, ఆహార నియమములు మనస్సును లోబఱచుకొనుటకు సహాయకారులే. మూర్తి

శరీరము కూడా ఆత్మ మయమే. ఈ విషయాన్ని శరీరములోనున్న కణాలు కూడా గ్రహిస్తాయి, అతి హర్షముగా (blissful) ఉంటాయి.

చాలా కాలము పరిచయము లేని చుట్టము మనతో ఉన్నను వారెవరో మనకు తెలియదు. ఫలానా అని తెలిసిన తర్వాత వారితో మనకు గల సంబంధాన్ని తిరుగదోడుకుంటాము. ఆత్మ విషయమున కూడా అంతే. యుగయుగాలనుండి మనస్సు బహిర్ముఖ కర్మలో మునిగియున్నందున, మనము ఆత్మ స్వరూపములై ఉన్నప్పటికి అది మనకు తెలియుట లేదు. సద్గురు సమక్షములో మనస్సుకు మనము ఆత్మ స్వరూపులమని బోధపడుతుంది. ఆత్మ స్వరూపమును మనస్సుకు పరిచయమైన తర్వాత విచారణ వలన ఆత్మ స్వరూపమునకు భంగము కల్గించు విషయాలు ఎఱుకపడి మన పరిశీలన వలన ఆ అడ్డంకులు శాశ్వతముగా తొలగించబడి మనస్సుకు తన జన్మ స్థానమైన ఆత్మయందు నిలిచి యుండెడి శక్తి అధికమగును. ఇది సహజ సమాధి.

భగవాన్ శ్రీ రమణ మహర్షి వంటి వారి ద్వారా ఒక్కసారి ఆత్మానుభూతి పొందిన తర్వాత మొట్టమొదటి సారిగా ఆత్మతో మనస్సుకు పరిచయము ఏర్పడుతుంది. ఈ మొదటిసారి ఆత్మానుభూతి మనస్సు ఎన్నటికి మరిచిపోలేనిది. అప్పటినుండి మనస్సునకు ఆత్మను తెలిసికోవాలనే వాంఛ తీవ్రముగా ఉంటుంది. ఆత్మాకార వృత్తి బయలుదేరి అది దినదిన ప్రవర్ధమానము చెంది మిగతా మానసిక వృత్తుల కంటే ఎక్కువ విజృంభించి ఆత్మానాత్మ విచారణకు దారి తీస్తుంది. మనస్సు ఆత్మలో స్థిరపడుతుంది. "నేను ఆత్మను" అనే వృత్తి "నేను దేహమును" అనే వృత్తిని నశింపచేస్తుంది. సూర్యరశ్మికి దూదిని చూపితే అది కాలి నశించదు. కాని భూతద్దము ద్వారా సూర్యరశ్మిని కేంద్రీకృతమొనర్చి (focussed light) దూది మీద పడేలా చేస్తే దూది వెంటనే కాలి బూడిద అవుతుంది. అట్లే తీక్షణమైన ఆత్మాకార వృత్తి ద్వారా మాత్రమే సామాన్య చైతన్యము కేంద్రీకృతమై (focussed awareness) అజ్ఞానము నశిస్తుంది.

ఆత్మజ్ఞానమెందుకు అవసరము?

ప్రస్తుతము మనము అజ్ఞానముగా ఉన్నందువల్ల భేదబుద్ధి కలిగి ఇతరులు,







కన్న వేఱుగా లేదు. నిదురలో తలంపులు లేవు. జగత్తును లేదు. జాగ్రత్తులోను స్వప్నములోను తలంపులు కలవు; జగమును కలదు. సాలీడు తననుండియే సన్ననినూలును వెలికితెచ్చి దానిని మఱల తనలోనికే తీసికొనును; ఆ విధముగానే మనస్సుగూడ తన నుండియే జగత్తును కల్పించి దానిని మఱల తనయందే లయము పొందించును. ఆత్మ స్వరూపమునుండియే మనస్సు వెలివడినయెడల జగము కనపడుచున్నది. కావున జగము కనవచ్చినప్పడు స్వరూపము కనరాదు; స్వరూపము కనపడినపుడు (ప్రకాశించినపుడు) జగత్తు కనరాదు. మనస్సు స్వరూపమును గూర్చి విమర్శించినపుడు కొనకు మనస్సు 'తాను'గానయిపోవును. 'తా'ననగా ఆత్మస్వరూపమే. మనస్సెప్పడును స్థూలరూపము ననుసరించియే యుండును. తాను వేఱుగా నుండదు. మనస్సే సూక్ష్మశరీరమని జీవుడని చెప్పబడుచున్నది.

**వివరణ:** స్థూలమైన కర్మేంద్రియములు, సూక్ష్మమైన జ్ఞానేంద్రియములు ప్రపంచ వ్యవహారము నడుపుటకు పనికివచ్చు పరికరములు.

మనస్సు లేక అంతఃకరణమనేది అంతరింద్రియము. అంతఃకరణములో నిశ్చయజ్ఞానము కలిగించేదానిని బుద్ధిగాను, సంకల్ప వికల్ప ధర్మంకలదానిని మనస్సుగాను, విషయానుభవాలతో చలించే దానిని చిత్తముగాను "నేను", "నాది" అని కర్తృత్వ, భోక్తృత్వ ధర్మము కలదానిని అహంభావముగాను వ్యవహరిస్తారు. అహంవృత్తి వస్తు నిశ్చయవృత్తిగా మారినపుడు దానిని బుద్ధి అంటారు. అహంవృత్తి సంకల్ప వికల్పాది వృత్తిగా మారినపుడు దానిని మనసంటారు. అహంవృత్తి అభిమాన వృత్తిగా మారినపుడు దానిని అహంకారం అంటారు. అహంవృత్తి పదార్థానుసంధానవృత్తిగా మారినప్పడు చిత్తమంటారు.

అంతఃకరణమనే అంతరింద్రియము బాహ్యేంద్రియములతో జోడింపబడినప్పడే అవి చైతన్యవంతమగును.

అంతఃకరణము స్వతహాగా చెడ్డదికాదు, మంచిది కాదు. అది మన చేతిలోనున్న అంతరింద్రియము. దానికి ఒక పని అప్పచెప్పినప్పడు చాకచక్యముగా (skilful) చేస్తుంది. ఏపని అప్పచెప్పతున్నాము అనేది మన ప్రవృత్తిమీద ఆధారపడి

ఉంటుంది.

జీవుడు అజ్ఞాన ఆవరణలోనున్నప్పుడు మనస్సనే ఈ అంతరేంద్రియము అజ్ఞానములో బీజరూపములో ఉన్న వాసనలను ఫలప్రదమయ్యేలాగా సర్వశక్తులను ఒడ్డి పనిచేస్తుంది.

అజ్ఞానములో దేహతాదాత్మ్యము ఉంటుంది. దేహతాదాత్మ్యము ఉన్నప్పుడు సుఖము బాహ్యములో, విషయాలలో ఉందనే భ్రాంతి ఉంటుంది. బాహ్య విషయాలను జ్ఞానేంద్రియాలు గుర్తించి ఆ సమాచారాన్ని మనస్సుకు చేరవేస్తాయి. మనస్సు ఆ సమాచారాన్ని విశ్లేషించి బుద్ధికి అందచేస్తుంది. ఆ అందిన సమాచారాన్ని బట్టి బుద్ధి వాసనలకనుగుణంగా ఒక నిశ్చయానికి వచ్చి ఏపని చేయాలనేది నిర్ణయించి ఆ పనిని కర్మేంద్రియములు ద్వారా అమలుచేస్తుంది.

ఆవరణ దోషమువల్ల బుద్ధికి ఆత్మజ్ఞానము లేనందువల్ల అది అజ్ఞానము తోనే ఉంటుంది. అందువల్ల అది ఇచ్చే ఆదేశాలు అజ్ఞాన జనితమైనవి. కనుక కాలప్రవాహములో అనేక కష్టాలు తెచ్చిపెడతాయి.

బాహ్య విషయాలను వెంబడిస్తే దుఃఖము కల్గుతుందని ఎప్పుడో ఒకప్పుడు బుద్ధికి తోస్తుంది. అప్పుడు దుఃఖము తొలగించుకొనే ఆలోచన మొదలవుతుంది.

దుఃఖము మన స్వరూపము కాదు కాబట్టి ఎవరూ దుఃఖమంటే ఇష్టపడరు. నేను, నాది, సంకల్పము, వికల్పము, సంశయము, నిరంతర విషయ స్మరణ దుఃఖానికే దారితీస్తాయని అనుభవ పూర్వకముగా బుద్ధికి తోచినప్పుడు, బుద్ధి సుఖము కోసము బాహ్య విషయాలపై దృష్టి సారించుట మాని బాహ్య విషయాలనుండి తనను ఉపసంహరించుకొన్నప్పుడు అంతరంగములోనే సుఖము కోసము వెదుకుతుంది. ఇదే జ్ఞాన విచారణకు బీజము.

సామాన్యంగా అందరి అనుభవములోనూ ఉన్న సుషుప్తిలో మనకు శరీరముతోకాని, జగత్తుతోకాని, ఇంద్రియములతోకాని, మనస్సుతోకాని, బుద్ధితోకాని ఏ సంబంధములేని స్థితిలో సుఖముగా ఉంటున్నాము. ఈ సుఖము బాహ్యాన్నుంచి రాలేదు కదా! ఇట్టి విచారణతో బుద్ధి తన స్వరూపమే సుఖమని తెలుసుకొంటుంది.







స్థితి బీజ జాగ్రత్తు. అట్టి బీజ జాగ్రత్తులోని ఆలోచనారహిత స్థితి మనస్సుకు కల్గినపుడు బాహ్య జగత్తులో తాదాత్మ్యము లేకుండా వ్యవహరిస్తాము. అట్టి స్థితిలోని విచారణ వలన ఆధ్యాత్మ చిత్తము ఏర్పడును. దాని వలన మనస్సుకు దేనితోను తాదాత్మ్యముండదు.

విచారణ యాంత్రికముగా చేసే మానసిక ప్రక్రియ మాత్రము కాదు. మనో మూలమును తెలిసికొనే సజీవ అన్వేషణయే విచారణ.

అహంవృత్తి "నేను దేహమును" అనే తాదాత్మ్యములో ఉన్నప్పుడు మనోబుద్ధి శరీరములు అజ్ఞాన కార్యమునే చేయుచుండును. అదే అహంవృత్తి బ్రహ్మ తాదాత్మ్యము పొందినపుడు మనోబుద్ధి చిత్తములకు "అహం బ్రహ్మోస్మి" అను మహావాక్యము యొక్క అర్థము అనుభూతికి వచ్చును. అపుడు శరీరము మనస్సు ప్రాపంచిక వ్యవహారములయందు సంచరించుచున్ననూ నేను కర్మచేయుచున్నా ననెడి భావము ఉండదు.

వ్యవహారమందు అజ్ఞాని, సర్వజ్ఞుడగు జ్ఞానియు, ప్రవర్తింతురు. కేవలము వాసనా మాత్రమునందే భేదముకలదు. అజ్ఞాని వాసనాయుక్తుడై వ్యవహరించును. జ్ఞాని వాసనా రహితుడై వ్యవహరించును.

విషయాసక్తమైన మనస్సు వాసనలకు పుట్టిల్లు. "నేను" యొక్క మూలము వాసనా రహిత స్థితి. అదియే ఎఱుక. ఆ ఎఱుకయే తాను అనుగుర్తింపు కొరకు "నేనెవడను" అను తలపును సదా అవలంభించియుండవలెను. ఆ తలంపే మన సర్వస్వముగా చేయు సాధనముగా కొనసాగించుట ఒక్కటే సహజ స్థితిని పొందుటకు ఉపాయము.

"నేను ఎవడను"? అను తలంపును సదా అవలంబించుటకు భగవాన్ చెప్పిన సమాధానము బహిర్ముఖముగా పోవు మనస్సును అంతర్ముఖపరిచే పద్ధతి. ఆత్మావలోకనము చేయు పురుషుని మనస్సు బ్రహ్మానంద సముద్రములో ఉప్పు వలె కరిగిపోవును. విషయాకర్షణ వలన మనస్సు బహిర్ముఖమగును. బహిర్ముఖము కాని మనస్సు ప్రయత్నము లేకుండయే అంతర్ముఖమగును. అంతర్ముఖ మనస్సంటే మనస్సు తన మూలములో ఉండుట. ఆ స్థితిలో మనస్సు,

ఇంద్రియముగా మనస్సును గుర్తించి, అడ్డు తగిలేదిగా అహంభావమును తెలిసికొంటే సాధనకు అది దగ్గర మార్గమవుతుంది. స్వరూప జ్ఞానము లేక అహంభావమే స్వరూపమని భ్రమించినవాడు విషయ సుఖములపై అనురాగము కల్గి కోరికలు పెరిగి బంధములు పెరుగును.

కర్మలనాచరింపకుండా సోమరితనముగా ఉండుట వలన మనస్సు నిష్క్రియము కాదు, చిత్తశుద్ధి పొందదు. కర్మలను ఆచరించునపుడు ఎదురైన సమస్యల తాకిడికి తట్టుకొనినపుడు మాత్రమే మనస్సు నిలిచి ఆలోచించుట నేర్చుకొనును. అప్పుడు ఆ ఆలోచన కలిగే "నేనెవడను?" అని ప్రశ్నించుకొంటే అది సాధనకు దగ్గర దారి. అప్పుడు చిత్తశుద్ధి కలిగి ఆత్మజ్ఞానముదయించును. ఆత్మజ్ఞానము వలన మోక్షము కల్గును. మోక్షమునకు అంతస్సన్యాసము, వాసనా క్షయము ముఖ్యము.

జ్ఞాని తన స్వరూపము ఎఱుక అని తెలిసికొన్నప్పుడు అతని మనస్సు ఎఱుకలో స్థితి పొందును. అనాత్మ రూపమైన శరీరము కర్మను చేయుచుండు ననియు ఆయా ఇంద్రియములు శబ్దాది విషయములయందు ప్రవర్తించుచున్న వనియు గ్రహించిన వాడై తాను ఆ కర్మలయందు ఎట్టి అభిమానము లేకుండా తామరాకుపై నీటి బిందువు వలె యుండును. "నేనెవడను?" అనే ప్రశ్నకు సమాధానముగా "తాను ఎఱుక" అను అనుభూతి హృదయ కేంద్రమున స్థిరపడును. అప్పుడు శరీర సుఖ దుఃఖముల యందు, కర్మలయందు అభిమానింపడు. కావున వాని ఫలములు అతనిని అంటవు.

"నేనెవడను"? అను మూల తలంపును గూర్చి విచారించుచు ఈ క్రింది సూత్రమును అమలుపరుచుకొంటూ జీవించాలి :

సత్కర్మ → చిత్తశుద్ధి → ఆత్మజ్ఞానము → వాసనా క్షయము → మోక్షము.

బీజ జాగ్రత్తు విచారణకు ఎంతయో సాయపడును. గాఢ నిద్రనుండి మేల్కాంచిన తరువాత జాగ్రదవస్థలో ప్రవేశించుటకు ముందు ఉండెడి సంధి స్థితియే బీజ జాగ్రత్తు. ఏ ఒక్క ఆలోచన కూడా మనస్సులో లేకుండు స్థితిని బీజ జాగ్రత్త అంటాము. మెలకువలో కూడా అంతఃకరణము నిష్క్రియముగా ఉండెడి







గాఢ నిద్రలో మనము సుఖముగానే ఉన్నాము. కాని గాఢనిద్ర అజ్ఞానావరణలో కల్గిన అనుభవము. అందుచేత అప్పుడు మనము ఎఱుకలో ఉండము.

గాఢనిద్రలో మనస్సు నిష్క్రియముగా ఉన్నది. ఆలోచనలు లేవు, జగత్తు లేదు, సంపద లేదు, శరీరానికి సంబంధించిన బంధువులు లేరు అయినప్పటికీ సుఖముగా ఉన్నాము.

ఎఱుకలో కూడా మనస్సు నిష్క్రియముగా ఉంటే సుషుప్తి సుఖమును మనము ఎఱుకలో అనుభవిస్తాము.

ఎఱుకలో మనస్సు నిష్క్రియముగా ఉండాలంటే మనము చేసే ప్రతి కర్మయు కళంకము లేకుండా ఉండాలి. ప్రస్తుతము మనము ఫలాసక్తితో మాత్రమే కర్మ చేస్తున్నాము. స్వార్థముతో జీవించినంతకాలము ఫలాసక్తితో ఉన్న కర్మ మాత్రమే చేయగలము. స్వార్థముతో కర్మ చేసినప్పుడు ఆ కర్మ అరిషడ్వర్గాలు అనే వాటితో ఎల్లప్పుడు కళంకితమవుతూనే ఉంటుంది. దీనికంతకు దేహ తాదాత్మ్యమే కారణము. దేహ తాదాత్మ్యము ఉన్నప్పుడు స్వార్థక్రియ తప్పదు. అందుచేత మనస్సు శుద్ధిగా నిష్క్రియముగా ఉండాలంటే దేహతాదాత్మ్యము ఉండకూడదు.

నేను దేహములో ఉన్నాను అనే స్పృహవల్ల ఏ సమస్యలు ఉండవు. మన చైతన్యానికి కృత్రిమ పరిమితి ఏర్పడదు. "నేను దేహము" అనే తలంపు మంచిదీ కాదు, చెడ్డదీ కాదు.

నేను దేహమును అనే తలంపు ద్వారా సామాన్య చైతన్యము (ultimate reality) యొక్క శక్తి అంతఃకరణము మీద ప్రతిఫలించి విశేష చైతన్యమై (reflected consciousness) వాసనలను చైతన్యము చేసి, ఆత్మ శక్తిని స్థూల శరీరానికి సరఫరా చేసి దాని ద్వారా వ్యవహారము సల్పును.

"నేను దేహమును" అనే తలంపు జ్ఞానిలోనూ, అజ్ఞానిలోనూ ఉంటుంది. జ్ఞానిలో నేను దేహము అను తలంపు దేహ స్పృహను మాత్రమే కలుగజేస్తుంది. స్వరూప జ్ఞానానికి ఆటంకము కాదు.

జీవుని పరిస్థితి వేరు. అతనిలోని చైతన్యము తమోగుణ ప్రధానమైన ఆవరణశక్తి వల్ల స్వరూప జ్ఞానము కోల్పోయి అజ్ఞాన స్థితిలో ఉంటుంది. అప్పుడు "నేను దేహము" అనే తలంపు అజ్ఞానము వలన కళంకితమై (contaminated I-am-the-body-idea) దేహ తాదాత్మ్యానికి దారితీస్తుంది. జీవితములో అన్ని అనర్థాలకు ఈ తాదాత్మ్యమే కారణము. విచారణ చేయగా చేయగా ఈ తాదాత్మ్యము తొలగి ఎఱుకలో స్వరూప జ్ఞానము కలిగి అలౌకిక ఆనందాన్ని అనుభవిస్తాము.

సుషుప్తికి సమాధికి భేదమేమి? సుషుప్తిలోను, సమాధిలోనూ కూడా మనస్సుగాని, ఆలోచనలుగాని ఉండవు. సుఖముగా ఉంటాము. కాని రెంటికి తేడా ఏమిటంటే సుషుప్తిలో మనస్సు తమోగుణంతో అజ్ఞాన చీకటి గుహతో తాదాత్మ్యము వలన ఎఱుక ఉండదు. సమాధిలో ఎఱుక ఉంటుంది. మనస్సులోని రజస్తమోగుణాలు సత్వగుణంతో లయమైనందు వలన ఎఱుక మాత్రమే ఉంటుంది. విచారణ ద్వారా ఎఱుకలో ఉండి అమనస్క స్థితిని పొందుతాము.

మనస్సు లేక అంతఃకరణము అజ్ఞాన కార్యాన్ని ఎంత సమర్థవంతముగా నిర్వహించగలదో అంతకంటే ఎక్కువ సమర్థవంతముగా ఆత్మజ్ఞాన సముపార్జనకు తోడ్పడుతుంది. ఇట్టి తోడ్పాటుకు అనుకూలపడు ఏకైక ఇంద్రియము ఈ మనస్సు.

ఇట్టి అంతరేంద్రియాన్ని ఏవిధముగా ఉపయోగించుకోవాలి? విషయాకర్షణ తగ్గినప్పుడు చిత్తచాంచల్యము తగ్గి మనస్సు నిశ్చలమవుతుంది. నిశ్చల మనస్సులో శుద్ధ చైతన్యపు కాంతి ప్రతిఫలించి భాసిస్తుంది. నిశ్చల మనస్సు సత్వగుణ ప్రధానము. రజస్తమోగుణములు సత్వగుణముతో కలిసిపోయి నిద్రాణముగా ఉంటాయి. రజస్తమోగుణములు నిద్రాణముగా ఉన్నప్పుడు మృత మనస్సు (inactive mind) సత్వ గుణపు పట్టులో మాత్రమే ఉండి, శుద్ధ చైతన్యపు కాంతిని ప్రతిఫలింప చేసుకొని స్వరూప జ్ఞానాన్ని పొందుతుంది. అంటే మనస్సు ఆత్మాకారము చెందుతుందన్నమాట. దీనినే ఆత్మాకార వృత్తి లేక బ్రహ్మాకార వృత్తి అంటారు.

సామాన్యంగా దేహ తాదాత్మ్యము చెందియున్న మనస్సు సత్వగుణ ప్రధానమైనప్పుడు ఆత్మానుసంధానము చెంది ఆత్మతో తాదాత్మ్యము చెందుతుంది.







## ప్రశ్న 11. "నేను ఎవడను?" అను తలపును సదా అవలంబించుటకు ఉపాయమేది?

**భగవాన్ :** వేఱుతలంపు లుదయించినను వానిని పూర్తిగ కొనసాగించుటకు యత్నింపక, "అవి యెవరికి గలిగినవి" అని విచారింపవలెను. ఎన్ని తలంపులు తోచినను దాని వలన నేమి? జాగ్రత్తగ ఒక్కొక్క తలంపు కల్గినతోడనే "ఇది ఎవరికి గల్గినది" అని విచారించినట్లయిన 'నా'కని తోచును. "నేను ఎవడను?" అని ప్రశ్నించుకొనినచో మనస్సు తాను పుట్టిన చోటునకు మఱలివచ్చును. వచ్చిన తలంపును అణగిపోవును. అట్లే అభ్యాసము చేయను చేయను మనస్సునకు తన జన్మస్థానమున నిలిచియుండు శక్తి యధికమగును. సూక్ష్మమైన మనస్సు మెదడు నుండియు ఇంద్రియముల ద్వారాను బయట వ్యాపించునపుడు స్థూలమైన నామరూపములు తోచుచున్నవి. అది హృదయమున నిలిచియుండు నపుడు నామ రూపములు కనుమరుగగుచున్నవి. మనస్సును బయటికి పోనీయక హృదయమున నిలుపుకొనుటకే "అహంముఖము" లేక "అంతర్ముఖము" అని పేరు. హృదయము నుండి దానిని వెలికి బోనిచ్చుటయే "బహిర్ముఖ" మనబడును. ఇట్లు మనస్సు హృదయమున నిలిచినట్లయిన తలంపు లన్నిటికి మూలమగు "నేను" తలంపుపోయి ఎప్పడు నుండు "తాను" మాత్రము ప్రకాశించును. ఏది చేసినను "నే"నను అహంకారము లేకయే చేయవలెను. ఆ విధముగ చేసినచో సర్వము శివస్వరూపముగ తోచును.

**వివరణ :** "నేను ఎవడను?" అను తలపును విచారణ ద్వారా శాశ్వతముగా మనస్సులో నిలిపికొనిన చాలు - అది మన నిజ స్వరూపమును మనకు పట్టి ఇస్తుంది.

"నేను ఎవడను?" అను మూల తలంపును సాధన ద్వారా మనస్సులో నిలిపికొనగల్గిన నాడు దైవానుగ్రహము సిద్ధించును. అనుగ్రహము పెరిగే కొద్దీ సాధన పెరుగును. సాధనలో నిర్దిష్టత కల్గినపుడు ఒకానొక శుభ ఘడియలో సంపూర్ణ అనుగ్రహము సిద్ధించి బ్రహ్మానుభూతి కల్గును. మోక్ష ప్రాప్తికి సహకరించే

లోకములు కావలెను కనుక ఈశ్వరుడు వీనిని సృజియించెను.

బ్రహ్మానుభూతి కల్గిన జ్ఞాని భగవత్ప్రేరితుడై విశుద్ధసత్వముతో కూడియున్న అంతఃకరణముతో లోకకళ్యాణార్థము మేల్కొనుచున్నాడు. దీనిని భావముఖ స్థితి యందురు.

మనస్సు అణగుట లేక లేకుండుట అనగా మనస్సు యొక్క తాదాత్మ్యము లేక సంగము లేకుండుట అని గ్రహించవలెను. నేను, నాది, ఫలాపేక్ష, కర్తృత్వము, అరిషడ్వర్గముల సంగము, వాసనలు ఇత్యాది బంధకారక ప్రవృత్తులు లేకుండా జీవించుటయే మనస్సు లేకుండా జీవించుట. ఇదే అమనస్కయోగ సాధనము.

దీనిలో కర్మ చేయుటకవసరమైనంత వరకే మనస్సు పనిచేయును. అనవసరమైన, బంధకారకమైన అహంకారమమకారములు, కర్తృత్వాది వాసనలు, స్వార్థమును, ఫలాపేక్ష, అరిషడ్వర్గాది దోష భావములతో కూడిన మనస్సు కర్మను కళంకితము చేయదు.

మీ ఇంటిలో ఇంటివారలతో, స్నేహితులతో, బంధువులతో, తోటి ఉద్యోగులతో, మనుష్యులతో ఇన్ని కార్యములు ఆచరించినపుడు కూడా అట్టి మనస్సు లేని స్థితి కల్గియుండి (అమనస్క స్థితి) కర్మ చేయవలెను. ఆత్మ జ్ఞాన సముపార్జన వలన ఈ జన్మయందలి సంబంధములు తాత్కాలికమే అన్న భావన దృఢపడుతుంది. తాను, తనవారు, పైవారు వారి వారి కర్మ ఫలములను ప్రారబ్ధానుసారముగా పొందుతున్నారని తెలుస్తుంది.

బంధకారకమైన, ద్వైత రూపమైన "సత్త"ను ప్రయత్న పూర్వకముగా పక్కకు పెట్టి సంగము లేని మనస్సుతో జీవించుట అభ్యాసము చేయవలెను. విశుద్ధ సత్వ స్వరూపమైన మనస్సుతో కర్మలను చేయుచు జీవించవలెను. సాధన కంటెయు పూర్వమే ఆత్మజ్ఞాన సముపార్జనము ఈశ్వరానుగ్రహము వలన పొందవచ్చును.

అహంవృత్తి పడిపోయినచో అది బ్రహ్మములో లయమగును, ఆత్మజ్ఞానము కలిగిన తరువాత అది పనిచేయుచున్నచో అది బ్రహ్మాకార వృత్తి యగును.

ఇంతవరకు చెప్పిన విచారణను కొనసాగించినపుడు మనస్సు అణగును.







విచారణ చేయగా చేయగా ఈ ఆత్మాకారవృత్తి ప్రబలి, అజ్ఞాన వృత్తిని నాశనము చేస్తుంది. అందుచేత మోక్షము కల్గుతుంది. బంధమోక్షములు రెండూ కూడా మానసిక ధర్మములే. ఆత్మతో వీటికి సంబంధము లేదు. ఆత్మ జ్ఞానము పొందటానికి మనస్సే ముఖ్యమైన సాధనము. ఆత్మజ్ఞానము పొందిన తర్వాత ఆత్మాకార వృత్తి కల్గిన మనస్సు ద్వారా లోక కళ్యాణానికి అనేక పనులు జరుగుతాయి.

ప్రపంచానికి మనస్సుకి గల సంబంధమెట్టిది? ప్రపంచము మనస్సుతో ఉదయించి మనస్సుతో అస్తమిస్తుంది. జీవుని యొక్క సృజనాత్మక శక్తియే మనస్సు. మనస్సు దేహ వాసనను అనుసరించి ప్రాపంచిక విషయ భోగములపై చలించుచు కోరికలను పెంచి అనేక వాసనలను తయారు చేసికొనును. ఈ వాసనలే జన్మబంధ కారణములగుచున్నవి.

మనస్సు బ్రహ్మమును విడిచి జగత్తుపై సంచరించుచు, విక్షేప ధర్మముతో అనేకత్వము చూచుచు (power of showing the unitary thing as multiplicity), ఆవరణ దోషముతో (veiling the nature of self) జగత్తును భేదబుద్ధితో చూచి పుణ్య పాపములను చేయుచున్నది.

మనస్సు శరీరముతో క్రియ సల్పుట వలన అవిద్యావరణమైన కారణ శరీరము యొక్క (causal body, self-ignorance) ప్రభావము బహిర్గతమగుచున్నది.

మనస్సు జన్మబంధకారకములైన కర్మలను, వాసనలను ఉత్పత్తి చేయు కర్మాగారము. కర్మ వాసనలను ఉత్పత్తి చేయుచున్నంత కాలము జీవులు జన్మ నెత్తుతూనే ఉండవలెను. ఇదియే కర్మ సముద్రము. దీని నుండి బయటపడ వలెనన్న మనస్సును నియమించవలెను. విచారణ వలన మనస్సు నియమింప బడును. దాని సంకల్ప వికల్ప బలములు నశించును. అప్పుడు మనో వ్యాపారము ఆగిపోవును. పాత వాసనలు నశించును. క్రొత్త వాసనలు పుట్టవు. బంధము నుండి విడుదల పొందుతాము. ఇట్టి మానసిక పరివర్తన (mind transformation) ఎంతయో ముఖ్యము.

లోక వ్యవహారములోనున్న మనస్సు చేసే చర్యలమీద నిఘా లేదు, ఎఱుకతో మనము పనిచేయుట లేదు, యాంత్రికముగా చేస్తున్నాము. విచారణ

ఎఱుకతో సల్లు ప్రక్రియ.  మనస్సు అట్టి విచారములో నిమగ్న మైనప్పుడు దాని కదలికలన్నీ ఎఱుకలో గోచరిస్తాయి.  అట్లు మనస్సు సంస్కరింప బడుతుంది. ఆత్మజ్ఞానము కల్గటానికి మనస్సుకు అర్హత ఏర్పడుతుంది.

మనస్సు ఆత్మ యొక్క ఒక పొర.  చైతన్య శక్తి ప్రాణశక్తి అనే ఈ రెండిటి సంబంధముచే సంకల్పమునకు హేతువైన మనస్సు జనించుచున్నది.  సంకల్ప మొనర్పకున్నచో మనస్సు నశించి చైతన్యము వ్యక్తమగును.

జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలోను మనస్సు ప్రజ్ఞానమే.  సుషుప్తిలో మనస్సు ప్రజ్ఞాన ఘనుడు.  మనస్సు యొక్క తాదాత్మ్యత లేనిదే ఇంద్రియములు ప్రపంచ విషయ జ్ఞానమును గుర్తించి నమోదు చేయజాలవు.  అందుచేత జాగ్రదవస్థలో మనస్సు నిష్క్రియముగా ఉండాలంటే అది పంచ జ్ఞానేంద్రియములతో జోడు కట్టకుండా ఉండాలి.

ఇది ఎట్లు సాధ్యము?  బ్రహ్మ చైతన్యము మనస్సులోనికి వ్యాపించి విశేష చైతన్యమై (reflected consciousness) ఇంద్రియములలోనికి వ్యాపించినప్పుడు ఇంద్రియములు చైతన్యవంతములగుచున్నవి.  విషయాకర్షణ లేనప్పుడు మనస్సులో ఉన్న విశేష చైతన్యము సాక్షితత్వ రూపమున మనకు గోచరించును. సాక్షితత్వములో ద్వైతమున్నది. గ్రహించెడిది విశేష చైతన్యము. గ్రహింపబడునది అనాత్మ.  ఈ స్థితిలో తాదాత్మ్యము లేదు కాని ద్వైతమున్నది.  కాని ఈ విశేష చైతన్యమనబడే సాక్షితత్త్వము ఆత్మ విచారణకు దారి చూపును.

పై విషయాలను బట్టి చూస్తే ఇంద్రియములకు రాజైన మనస్సు ఆత్మజ్ఞాన సముపార్జనకు మనకు అందుబాటులో ఉన్న ఒకే ఒక ఆధారము.  సాధన ప్రథమ దశలో సాక్షితత్వములో విచారణ ద్వారా స్థితి పొందవలెను.  ఇది ఎట్లు?

చూడబడేది ఏదీ మనము కాదు.  జగత్తు, శరీరము ఇంద్రియములే కాకుండా మనస్సులోని జడములకు సంబంధించినవి కూడా దృశ్యములే, అనగా చూడబడేవే.  ఈ జడచైతన్యముల విచారణ ద్వారా, ఆత్మానాత్మ విచారణ ద్వారా సాక్షి తత్వములో స్థితి పొందవలెను.  విచారణ చేసినపుడు సాక్షి తత్వము గల విశేష చైతన్యము బ్రహ్మాకారము చెంది మనోలయమగును.



- 16A -



సృష్టి యొక్క వ్యక్త రూపము అనిత్యము.  సృష్టి ఆరోపితము.  ఉన్నది బ్రహ్మమొక్కటే.  నామ రూపముల వలన సృష్టియనెడి భావము బ్రహ్మమందు ఆరోపించబడినది. సృష్టి వివర్తము అనగా బ్రహ్మమే సృష్టిగా గోచరిస్తుంది.  తాను మార్పు చెందకుండగనే, నామ రూపములను పొంది వేరే వస్తువుగా (జగత్తుగా) గోచరించుట వివర్తము.  సృష్టి మిధ్య కాదు, భ్రాంతి కాదు, కాని సృష్టి బ్రహ్మము కాదను దృష్టి మిథ్య లేక భ్రాంతి.  జగత్తు మిథ్యయని చెప్పట జగత్తు పట్ల బ్రహ్మ భావము నిలుపుకొనుట కొరకే.

“నగ” అనెడి భావము బంగారముపై ఆరోపింపబడినట్లు, సముద్రము మధ్యలో “మంచు నగరము” అను భావము నీటిపై ఆరోపింపబడినట్లు, జగత్తు అనే భావము బ్రహ్మముపై ఆరోపింపబడినది.

వేదాంత పరిభాషలో అసత్యమనగా నశించెడి స్వభావము కలది అను అర్థము.  బ్రహ్మజ్ఞానముతో చూచినపుడు జగదృష్టి నశించును.  బ్రహ్మజ్ఞానము కల్గిన వెంటనే జగద్దృష్టి తన ఉనికిని కోల్పోవుచున్నది.  ఒకే జగత్తు ఒకే సమయములో అజ్ఞానులకు ఉన్నట్లుగను, జ్ఞానులకు లేనట్లుగను తోచుచున్నది. అజ్ఞానులు పాంచభౌతిక మనశ్శరీరములతో చూచినపుడు బ్రహ్మమే జగత్తుగా గోచరించును.  ఇది భ్రాంతి..

బ్రహ్మ చైతన్య వ్యాప్తి జరిగిన వెంటనే త్రిగుణాత్మకమైన, జడమైన మాయ చైతన్యవంతమై సృష్టిగా రూపాంతరము చెందును.  అట్లగుట దాని సహజధర్మము.

అనాత్మ మొత్తము మాయకు సంబంధించినదే.  చూచేవాడిగా ఉన్న మనశ్శరీరములు, చూడబడేదిగా ఉన్న జగత్తు రెండూ అనాత్మకు సంబంధించినవే అనగా మాయలోని భాగమే.  మాయ బ్రహ్మమును ఆవరించియున్న ఒక విషయము.  అందుచేత సర్వము బ్రహ్మమయమే.

బ్రహ్మమును జగత్తుగా భావించుటకు కారణము అజ్ఞానావరణము. మాయ బ్రహ్మమును ఆవరించుకొని తన అధీనములో నడిపించు స్థితి సృష్టి కార్యము వలననే జరిగినది.  అందుచేత అజ్ఞానావరణమే సృష్టి.

సకల ప్రాణులు తమ కర్మఫలములు అనుభవించుటకు శరీరములు,

వివిధ తత్త్వాల పరిశీలన చేయకుండా సరాసరిగా ఆత్మ ఉనికిని గుర్తించి తాను అదిగా ఉండడానికి ప్రయత్నించవచ్చును. తన స్వరూపమును మరుగుపర్చు తత్త్వముల విచారణ బహిర్ముఖ మనస్సు అవిద్య పట్టులో ఉన్నప్పుడు జరిగేది. వీటి జోలికి వెళ్లిన మరుక్షణము మనము దారి తప్పినట్లే. ఆత్మ విచారణ మాత్రము అది కాదు.

మానసిక అవస్థలు మూడునూ భ్రాంతులే. భ్రాంతులు నిద్రలోనే జనిస్తాయి. అజ్ఞానావస్థ నిద్రావస్థ. (Stupor) మనము జాగ్రదవస్థ నిజమనుకొని, స్వప్నమును భ్రాంతని అనుకొంటాము. ఆత్మలో మేల్కొన్నప్పుడు ఈ మూడు అవస్థలు స్వప్న తుల్యములని, భ్రాంతులని తెలుస్తాయి.

పరమానందము పొందుటకు విషయాకర్షణ లేని అంతర్ముఖ మనస్సు సాధనమని తెలిసేవరకు మాత్రమే శాస్త్రాధ్యయనము అవసరము. అతిగా శాస్త్రము చదివిన వారికి ఆత్మ వస్తువు దొరకకపోగా అయోమయంలో పడటం తథ్యం.

విచారణకు నీవే కేంద్రము. ఆ కేంద్రమే హృదయము. హృదయము ఒక భావన కాదు. లక్ష్యము (goal) కూడా కాదు. ఆ హృదయమే నీవు (you are that). సంతతాభ్యాసము వలనను, విచారణ ద్వారాను మనోబలము కల్గినపుడు ఇతర భావాలు పలాయనం చిత్తగిస్తాయి.

అన్ని విషయాలు వర్జించి తాను తానుగా విషయము లేని విషయి ఉండిపోవటమే మనస్సణుగుటకు మార్గము. తాను అనేది ప్రత్యక్షానుభవమైన సత్యము.

ఆనందమిచ్చేవి బాహ్య విషయాలు కావనే జ్ఞానము కల్గితే మనస్సుకు విషయాకర్షణ ఉండదు. అదే వైరాగ్యం. మనస్సును ప్రకాశింపచేయునది బ్రహ్మమునకు వేరుగా లేనిదని తెలిసి, సుఖము బ్రహ్మములో ఉన్నందున దానిని వదలకుండుట జ్ఞానము. అందువలన మనస్సు ఏ విషయము వైపు మరలకుండుట వైరాగ్యము.

ఆలోచనలు ఆత్మకు విజాతీయము. వాటిని వెంబడించి కొట్టుకొని పోకూడదు. భావాతీత సహజ శాంత్యానంద స్థితిని అనుభవించవలెను.







అభ్యాస వైరాగ్యములచేత మనోచలనము నిరోధింపబడును. ఆత్మ జ్ఞానముచే వైరాగ్యము సిద్ధించును.

శమదమాది షట్క సంపత్తితో ముముక్షత్వము ప్రాప్తింపచేస్తున్నది మనస్సే.

భగవంతునిపట్ల అనన్యభక్తి ఉండునది మనస్సుకే.

అహం బ్రహ్మాస్మి, సర్వం ఖల్విదం బ్రహ్మ వంటి మహా వాక్యములను అనుభూతమొనర్చుకొనేది మనస్సే.

తాను ఆత్మాకారము చెంది ఇంద్రియములను అంతర్ముఖము చేసి వాసనా క్షయము కల్గించునది మనస్సే.

ఆత్మ జ్ఞానమును అనుభూతమొనర్చుకొని కారణ శరీర నాశనమునకు సహకరించునది మనస్సే.

విచారణలో నిమగ్నమై బంధకారక వృత్తులను నశింపచేసుకొని, మోక్ష కారక విశుద్ధ సత్వమును మిగుల్చుకొని మోక్షమునకు దారితీయునది మనస్సే.

ఇదం వృత్తులను నిరోధించి (చిత్త వృత్తి నిరోధము) అహంవృత్తిని ఆత్మానుసంధానము చేసేది మనస్సే.

దీని వలన దేహ తాదాత్మ్యము నశిస్తుంది. ఇంకా అనేక రకాలుగా మోక్షమునకు మనస్సు సహకరిస్తుంది.

మనస్సనెడి పరికరమును ఎట్లా వినియోగించుకోవడమన్నది, మన వివేకముపై ఆధారపడి ఉంటుంది. అవివేకులు విషయాసక్తులై మనస్సును బంధములోకి దింపుతారు. వివేకులు విషయ విరక్తులై మనస్సును మోక్ష మార్గమునకు మళ్లిస్తారు.

మనస్సే మోహములకు కారణము. జనన మరణములు దీని భావనలే. ఇట్టి భావములు బంధములకు మూలములు. ఆత్మాకారము చెందిన మనస్సుకే ముక్తి.

### ప్రశ్న 9. మనస్సు స్వరూపమును విమర్శించి తెలిసికొను మార్గమేది?

**భగవాన్ :** ఈ శరీరములో 'నేను' అని స్ఫురించునది యేదో అదే మనస్సు.

